సంపుటి 8
సంచిక 11

# సోవియట్ భూమి

జూన్ 10.
1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖచే ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక

మా పత్రికలలోని అన్ని విషయాలను ఎటువంటి అనుమతి లేకుండా పునర్ముద్రించుకోవచ్చును

# లెనిన్ కలగన్న కర్మాగారం

## యెవ్‌గెనీ వూర్

*కన్వెన్షనల్ బేరింగ్స్‌ను తయారుచేయడం కోసం పూర్తిగా స్వయంచోదకమైన ఒక కర్మాగారం, మొదటి మాస్కో బేరింగ్ పరిశ్రమలో పనిచేస్తున్నది. నికొలాయ్ ఒల్చెక్ ఆధిపత్యాన ఒక డిజైనర్ల బృందానికి, యీ కర్మాగారాన్ని నిర్మించినందుకు యిటీవల లెనిన్ బహుమానం లభించింది. ఈ కొత్త కర్మాగారం ఎలా పనిచేస్తోందో యీ రచన తెలియజేస్తోంది.*

దీపాలు వెలుగుతోన్న ఒక బ్రహ్మాండమైన హాలులో, గొప్ప రొదచేస్తోన్న పెద్ద యంత్రాలు అమర్చివున్నాయి.

వాటిని నడపేవారు కనుచూపు మేరలో ఎవ్వరూ లేరు.

యంత్రాలే మీతో సంభాషణను మొదలు పెట్టేటట్టుగా కనిపిస్తున్నాయి. రంగురంగుల దీపాలు వెలుగుతుంటాయి. ఆరిపోతుంటాయి. స్వయంచలితమైన ఒక పరికరం పని స్వభావాన్నీ, ఫ్లాడ్ పార్ట్స్ సంఖ్యనూ, ఆటోమేటిక్ కంట్రోలర్స్ కనిపెట్టిన లోపాల రకాలనూ సైతం—వీటికి సంబంధించిన వివిధ విషయాలను తు చ తప్పకుండా వివరిస్తూ ఏదో ఒక రంగు దీపం వెలగడమూ, ఆరడమూ జరుగుతూ వుంటుంది. మనం స్వయం చలన ప్రపంచంలోనికి ప్రవేశించాము.

సోవియట్ డిజైనర్ల, యింజినీర్ల పెద్ద బృందం ఒకదానికి, యీ స్వయంచలన కర్మాగారాన్ని నిర్మించినందుకు యిప్పుడు గౌరవ పారితోషికం లభించింది. మా డిజైనర్లందరికీ, మా యావత్తు దేశపు సాంకేతిక విజయాలకూ యిది ఒక విజయం.

కొన్ని ఫలితాలను సమీక్షించడం, యిప్పుడు సాధ్యమే. పరిశ్రమలోని అతి నవీనమైన కర్మాగారపు కార్మికులు యీ అద్భుత యంత్రాల విషయంలో పూర్తిగా సిద్ధహస్తులయ్యారు. ఈ కర్మాగారములో రెండు రకాల రోలర్, బాల్ బేరింగులను తయారు చేయడానికి యిప్పుడు ముందుకంటె చాలా తక్కువ కాలం పడుతుంది: యిదే ఉత్పత్తిచేసే సామాన్య కర్మాగారాలలోకంటె యిక్కడ కార్మికులు సగం వుంటారు. కాని, యివి ప్రథమ ఫలితాలు మాత్రమే. స్వయం చలిత కర్మాగార నిర్మాతలు యింతకంటె అధికమే సాధించారు. పూర్తిగా కొత్తరకపు పరిశ్రమను, లెనిన్ ఊహించిన పరిశ్రమ వంటిదానిని శారీరక మానసిక శ్రమల మధ్య తేడా చివరికి తొలగింపబడి, పెద్ద శరీరశ్రమకు సంబంధించిన పనులు పూర్తిగా యంత్రాలకు అప్పగింపబడే పరిశ్రమను వారు సృష్టించారు.

స్వయం చలితమైన కర్మాగారంలో మీకు మొదట ప్రస్ఫుటమయ్యేది, లోహపుపనుల పరిశ్రమకు సాధారణంగావుండని సంపూర్ణమైన పరిశుభ్రత. భాగాలు ఒక యంత్రం నుండి యింకో యంత్రానికి మూసివున్న కన్వేయర్స్ ద్వారా తీసుకపోబడతాయి. కర్మాగారపు రాతి చప్టా క్రింద పెట్టబడిన శక్తివంతమైన సాధనాలు, లోహపు ముక్కలను తీసుకపోతాయి.

(మిగత 40వ పుటలో)

యూ. వోల్చెక్, లెనిన్ బహుమతి విజేత, ధారావాహికంగా బేరింగుల తయారుచెయ్యను, సంక్లిష్ట స్వయంచోదన కర్మాగార నిర్మాతలలో ఒకరు



# ‘పాలక వర్గ’ నిర్ణయం

## ఇలియా జ్వెరోవ్

అభిమాన పాత్రమైన సోవియట్ కార్మిక వీరవనితలలో ఒకరైన ప్రస్కోవియా అంగిలీనా ఒకసారి చక్కగా యిలా అన్నారు: "సోవియట్ దేశపు 'పాలక వర్గాల'కు వ్యతిరేకంగా కొందరు విదేశీ రాజకీయవేత్తల దాడులను నేను వార్తా పత్రికలలో చదువుతుంటాను. కాని సోవియట్ దేశంలోని యీ పాలకవర్గాల వారెవరు? వారు 'రెండువందల కుటుంబాలు' కావు. వారు యిరవైకోట్ల మంది సోవియట్ ప్రజలు, మా ప్రజలందరూ."

కృశ్చేవ్ నివేదికలోని సిద్ధాంతాలను ఉత్సాహంగా సోవియట్ ప్రజలు చర్చిస్తున్నప్పుడు, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ ఏడవ సమావేశానికి కాస్త ముందర, యిటీవల నేనీ మాటలను జ్ఞాపకం తెచ్చుకున్నాను.

ప్రభుత్వమూ, కమ్యూనిస్టుపార్టీ పరిశ్రమలను ఉత్తమోత్తంగా నిర్వహించడం ఎలాగ అన్న చాలా ముఖ్యమైన సమస్యను చర్చకు నివేదించారు. ప్రతి ఒక్కరికీ యిందులో చాలా ఆసక్తి వుందని తేలింది.

ప్రవదానుండి అతిచిన్న ఫ్యాక్టరీ బులిటిన్‌వరకూ అన్ని వార్తా పత్రికలలోనూ, అన్ని సమావేశాలలోనూ (నెలకు కాస్త యెక్కువ కాలంలో 514,000 కి పైగా యివి జరిగాయి) సామాన్య ప్రజలు తమ అభిప్రాయాలను వెల్లడించారు. వసంతకాలపు యీ రోజుల్లో టర్నర్ల, నేత పనివారల, విద్యార్థుల, బుక్ కీపర్ల ప్రవీణవాణి వినిపించింది. ప్రతి ఒక్కరూ పునర్నిర్మాణం గురించి ప్రసంగించారు.

ఏమిటీ పునర్నిర్మాణం? దీనికి కారణాలేమిటి?

దేశం తన తొలి పంచవర్ష ప్రణాళికలను ప్రారంభించినప్పుడు, పారిశ్రామికీకరణ అప్పుడప్పుడే మొదలయినప్పుడు ముఖ్య లక్ష్యాలు వేళ్ళమీద లెక్కించగలిగినన్ని మాత్రమే వుండేవి. ఈనాడు సోవియట్ దేశంలో రెండు లక్షలకు పైగా పారిశ్రామిక సంస్థలూ, లక్షకు పైగా నిర్మాణస్థలాలూ వున్నాయి. నీపర్ నదిపైనున్న దానంత పెద్ద అనేక జల విద్యుత్కేంద్రాలను ప్రతి ఏడాదీ మేము పనిలో పెడుచున్నాము; పారిశ్రామికీకరణ ప్రారంభంలో యీ బ్రహ్మాండమైన కేంద్రాలలో ఒక దానిని నాలుగేళ్ళలో నిర్మించడమంటే గొప్ప విజయంగా పరిగణింపబడేది.

ఇప్పుడు యెన్నో నిర్మాణాలూ, పరిశ్రమలూ వుండడంవల్ల, వాటి కెపేసిటీ యెంతో పెరిగిపోవడంవల్ల వాటిని కేంద్రంనుండి నిర్వహించడం, అంటే మంత్రిత్వ శాఖలనుండి, శాఖలనుండీ నిర్వహించడమూ, వాటి ప్రతి ఒక్కదానినీ గమనిస్తూ వుండడమూ, వాటి అవసరాలన్నిటినీ సవివరంగా తెలుసుకుంటూ వుండడమూ కష్టమైపోయింది.

"పారిశ్రామిక, నిర్మాణ నిర్వహణను యింకా అభివృద్ధిచేయడం గురించి" కృశ్చేవ్ నివేదికలోని సిద్ధాంతాలు ప్రజలచర్చకు ప్రాతిపదిక అయ్యాయి. మంత్రిత్వశాఖల నిర్వహణనుండీ ప్రాంతీయ ప్రాతిపదికపైని నిర్వహణకు మార్పుగురించి, ఆర్థిక పరిపాలనా మండలాల జాతీయ ఆర్థిక వ్యవస్థా సంఘాల నిర్మాణంతో, యీ పత్రం ప్రస్తావిస్తుంది. ఈ విధంగా అది ఆర్థిక నిర్వహణలో స్థానిక సంస్థల, ప్రధానంగా జాతీయ యూనియన్ రిపబ్లిక్కుల హక్కుల విస్తరణనూ, నిర్వహణాధికారాన్ని ప్రజలకు యింకా సన్నిహితంగా తీసుకరావడాన్నీ, వారి పలుకుబడిని అన్ని విధాలా అధికం చేయడాన్నీ ప్రస్తావిస్తుంది.

"ఎగువనుండి మీరు బాగా చూడవచ్చును" అని ఒక సామెత వుంది. కాని మీరు ప్రతి ఒక్కదానినీ, ఎప్పుడూ అలా చూడగలరా? దిగువనుండి కొన్ని వేళల్లో చాలావాటిని, ఎక్కువ బాగా చూడవచ్చును. తమ ఉపన్యాసాలలోనూ, వ్యాసాలలోనూ సామాన్య కార్మికులూ, యింజినీర్లూ కృషిని కృత్రిమంగా విభజించి భగ్నంచేసే శాఖల నిరోధాలను తీవ్రంగా విమర్శించారు. కాని చర్చలోని అత్యంత విశిష్టమైన, ప్రముఖమైన గుణం. దాని నిర్మాణాత్మక స్వభావం. ఎవరు చెప్పినప్పటికీ—అకెడిమీషియన్ అయినా, గనికార్మికుడైనా—వారు తమ ఆలోచనల, అన్వేషణల, అనుభవాల ఫలితమైన స్వంత దిద్దుబాటును ప్రతిపాదించారు. ఈ పెద్ద ప్రభుత్వ వ్యవహారం ప్రతి ఒక్కరికీ సంబంధించినదన్నది స్పష్టమే.

ప్రముఖ విజ్ఞానశాస్త్రజ్ఞులు—మాస్కో అకెడిమీషియన్లు యం. లవ్రెంతీవ్, యస్. ఖ్రిస్తియనోవిచ్—తమ సహాయకులతో బాటుగా, సైబీరియాకు వెళ్ళి, అక్కడ ఒక కొత్త విజ్ఞానశాస్త్ర కేంద్రాన్ని నెలకొల్పడానికి సంసిద్ధతను తెలియజేశారు. ఆ విధంగా వారు దేశంలోని బ్రహ్మాండంగా అభివృద్ధి చెందుతోన్న మారుమూల ప్రాంతాలకు ఎక్కువగా సహాయపడగలుగుతామని భావించారు. ఇదే ప్రభుత్వ సంస్థకు తజిక్ ఆటోమోబైల్ రవాణాసంస్థ ఉద్యోగి యణ. జమొనోవ్ ఒక చిన్న ప్రతిపాదనను చేశారు. కార్లను యింకా బాగా ఉపయోగించేందుకూ, ఆఫీస్ సిబ్బందిని తగ్గించేందుకూ కొన్ని డజన్ల చిన్న ఆటోమోబైల్ సంస్థలను కలిపి వెయ్యాలని ప్రతిపాదించారాయన. చాలా దూరానగల ఆర్కిటిక్ నగరమైన నోరిల్‌స్క్ ఎలెక్ట్రిక్ లోకోమోటివ్ యింజినీరు పి. మల్యకోవ్, రైల్వే నిర్వహణను పునర్నిర్మించవలసిన ఆవశ్యకత గలదని సమర్థంగావాదించారు. ఒకే పనిని చేసే కొన్ని శాఖలను రద్దుచేసినట్టయితే సాలుకు ఏడు లక్షల రూబుళ్లు కలసి వస్తుందనీ, పరిపాలనను సులభతరం గావిస్తుందనీ ఆయన అంచనా వేశారు.

తమ కార్యాలయాలను వదిలి తాము ఎక్కువ బాగా పనిచేయ గలిగే పరిశ్రమకు వెళ్ళడానికి, యీ రోజుల్లో మంత్రిత్వ శాఖల, విభాగాల చాలామంది ఉద్యోగులు నిర్ణయించుకున్నారు. ఈ ప్రకారం ఉదాహరణకు కేంద్రగని—నిర్మాణ పరిపాలనా సమిష్టిసంస్థ, తన ప్రధానోద్యోగి వై. చుక్రెయేవ్ నాయకత్వాన, బొగ్గు పరిశ్రమయొక్క కొత్త నిర్మాణపు పనులు కేంద్రీకరింపబడి వున్న తులామండలానికి మాస్కో-నుండి శాశ్వతంగా వెళ్లిపోవడానికి అభిమతాన్ని వెల్లడించారు. చాలామంది ఉద్యోగులు మళ్ళీ గనులలో పనికి తిరిగీ వెళ్లి పోతారు. ఇవ్వన్నీ ప్రజల చర్చల స్వభావాన్ని తెలియజేసే దృష్టాంతాలు మాత్రమే.

జాతీయార్థిక వ్యవస్థ స్థానిక సంఘాలచే నిర్వహింపబడే కొత్త ఆర్థిక మండలాలు ఎలా వుండాలన్న దానిని గురించి సమావేశం లోనూ, దానికి ముందురోజుల్లోనూ ఎంతో చెప్పబడింది. మా దేశ పటాన్ని చూస్తుంటే సైబీరియాకు, బాల్టిక్ మండలాలకూ, కజక్ స్తాన్‌కూ, ఉక్రెయిన్‌కూ నేను వెళ్లిన యాత్రలు జ్ఞాపకం వస్తాయి; యీ ఆర్థిక మండలాలు ఏ రూపాన్ని ధరిస్తాయో అని ఊహించు కోవడానికి ప్రయత్నిస్తాను. ఉదాహరణకు దోనెత్స్ బేసిన్‌లోని ఒరొషిలోవ్‌గ్రాడ్ మండలాన్ని తీసుకోండి. ప్రతి ఏడాదీ యిక్కడ లక్షలాది టన్నుల బొగ్గు త్రవ్వకం చేయబడుతోంది, యంత్రనిర్మాణ, లోహ, రసాయనిక, నిర్మాణ-వస్తు పరిశ్రమలిక్కడ ఉన్నాయి.

ఈ మండలం యిప్పుడు తన ఆర్థిక సమస్యలను పరిష్కరించు కోవడంలో చాలవరకూ స్వతంత్రంగా వుంటుంది. ఈ సమస్యలు అన్నీ కాకపోయినా, చాలా వరకూ స్థానికంగా, దోనెత్స్ బేసిన్‌లో నిర్ణయింపబడుతాయి.

మే నెలలో జరిగిన సోవియట్ దేశ సుప్రీంసోవియట్ సప్తమ సమావేశం, ప్రజల చర్చల విషయంలో నిర్ణయాత్మకమైనది, తుది దశను సూచిస్తుంది. సుమారు 2,368,000 మంది సోవియట్ ప్రజలు పత్రికలలోనూ, సభలలోనూ ప్రణాళికా బద్ధమైన పునర్నిర్మాణం గురించి బహిరంగ ప్రకటనలను చేశారు, అనేక ప్రతిపాదనలనూ, సవరణలనూ నివేదించారు. సామాన్య ప్రజల తీర్పులను సుప్రీం సోవియట్ జాగ్రత్తగా పరిశీలించింది. ప్రజల సవరణలకు కృశ్చెవ్ నివేదికలో బాగా స్థానంయివ్వబడింది. కృశ్చెవ్, యీ ప్రతిపాదనలూ, విమర్శలూ ఆర్థిక నిర్మాణ నిర్వహణకు యింకా పరిపూర్ణమైన, యింకా మృదువైన రూపాలను కనుగొనడానికి తోడ్పడుతవన్న తన నమ్మకాన్ని వ్యక్తపరిచారు. వాస్తవానికి ప్రసంగించిన సభ్యులలో అధిక భాగం, శ్రామిక ప్రజలు నివేదించిన ప్రతిపాదనల గురించి ప్రస్తావించారు.

రిపబ్లిక్కులలోని పారిశ్రామిక మంత్రివర్గాల సమస్య గురించి చర్చను, ప్రత్యేకంగా పేర్కొనాలి. బొగ్గు, నూనె, లోహ పరిశ్రమకు సంబంధించిన అఖిల సమాఖ్య మంత్రిత్వ శాఖలను రద్దుచేసి, అటువంటి మంత్రిత్వశాఖలను రిపబ్లిక్కులలో ఏర్పాటు పెట్టడం సమంజసమేనా ? లెనిన్‌గ్రాడ్, ఆల్మా-అతా- కీవ్, స్వెర్ద్‌లోవ్‌స్క్‌కు చెందిన సభ్యులు అది సమంజసమేనన్నారు. కాకూసభ్యుడు వారితో అంగీకరించలేదు. సుప్రీం సోవియట్ యీ సమస్యా పరిష్కారాన్ని రిపబ్లిక్కులకే వదిలి పెట్టింది. ఈ ప్రతిపాదనలను చర్చించడానికి అన్ని యూనియన్ రిపబ్లిక్కుల, వివిధ ప్రాంతాల, మండలాల ప్రతినిధులుగల ఒక సంఘం ఏర్పరుపబడింది. సోవియట్ దేశ మంత్రివర్గాధ్యక్షుడు, సభ్యుడు యన్. బుల్గానిన్; సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు అధ్యక్షుడు, సభ్యుడు ఎ. నెస్మెయనోవ్; ఒక యంత్ర-నిర్మాణ పరిశ్రమలో టర్నర్, సభ్యుడు ఆర్. బైకోవ్— యీ సంఘంలో కలసి పనిచేశారు. సోవియట్ దేశ సుప్రీం సోవియట్ ఆమోదించిన యీ చట్టం, ప్రజల విస్తృతానుభవాన్ననుసరించి తయారు చేయబడింది.

ఇంకా ఆలోచించవలసింది చాలావుంది, చేయవలసింది చాలా వుంది. ఉద్దేశించిన పునర్నిర్మాణం, సాధ్యమైనంత బాగా అమలు జరుపబడాలి. కాని దేశపు "పాలకవర్గం". అంటే దాని యిరవై కోట్ల ప్రజలు, దానిని గురించి ఆలోచిస్తున్నారు గాబట్టి, దానిని నిర్ణయిస్తున్నారుగాబట్టి, నడుపుతున్నారుగాబట్టి యీ బృహత్కార్యంవిజయం పొందడం తథ్యం.

*మా పత్రిక వచ్చేసంచికలో, ఉద్దేశింపబడిన పునర్నిర్మాణ ఆర్థిక ప్రాముఖ్యం గురించి యం. పొస్తొలోవ్‌స్కీ వ్యాసాన్ని చదవండి.*

సోవియట్ దేశ సుప్రీంసోవియట్ సమావేశంలో ఓటుచేస్తున్న సభ్యులు



# వ్యవసాయకోత్పత్తిలో అమెరికాను అధిగమించడానికి సోవియట్ దేశానికిగల అపారావకాశాలు

## రష్యన్ సమాఖ్యా వాయువ్య ప్రాంతాల వ్యవసాయక మహాసభలో ఎన్. ఎస్. కృశ్చెవ్ ప్రసంగం

మాస్కో, 24—5—57, (టాస్)

మే 22న, లెనిన్ గ్రాడ్‌లో జరిగిన రష్యన్ సమాఖ్య వాయువ్య ప్రాంతాల వ్యవసాయక మహాసభలో సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధమ కార్యదర్శి ఎన్. ఎస్. కృశ్చేవ్ చేసిన ప్రసంగాన్ని యివాళ మాస్కో పత్రికలు ప్రచురించాయి.



రాబోవు కొద్ది సంవత్సరాలలో తల వక్కంటికి పశుగణ ఉత్పత్తిలో అమెరికాను దాటిపోవడానికి సోవియట్ దేశానికి ఇప్పుడు అపారమైన అవకాశాలున్నాయి, అని ఆయన అన్నారు.

తల వక్కంటికి పాల ఉత్పత్తిలో సోవియట్ దేశం 1958 లో అమెరికాను దాటిపోవడమేకాక బాగా ముందుకు పోగలదని కృశ్చేవ్ అన్నారు.

తల వక్కంటికి మాంసంఉత్పత్తిలో సోవియట్ దేశం 1960 లో గాని 1961 లో గాని అమెరికాను చేరుకోగలదు అన్నారు కృశ్చెవ్. అందుకోసమై మాంసంఉత్పత్తిని 1956 లో కంటె 3.15 రెట్లు యెక్కువ చెయ్యాలి. దేశంలోని వివిధ ప్రాంతాల మధ్య జరిగే పోటీవల్ల యిందుకై అవసరమయే కాలం తగ్గింపబడవచ్చును అని కృశ్చెవ్ సూచించారు. తన ప్రసంగంలో కృశ్చేవ్, అమెరికాలోనూ, సోవియట్ దేశంలోనూ గల తలవక్కంటికి వ్యవసాయక ఉత్పత్తికి సంబంధించిన అంకెలను తెలియజేశారు. 1956 లో అంకెలు యీ విధంగా వున్నాయి: సోవియట్ దేశంలో 32.3 కిలోగ్రాముల మాంసం, అమెరికాలో 102.3 కిలో గ్రాములు; సోవియట్ దేశంలో 245 కిలోగ్రాములూ, అమెరికాలో 343 కిలోగ్రాములూ పాలు; సోవియట్ దేశంలో 2.8 కిలోగ్రాములు, అమెరికాలో 3.8 కిలోగ్రాములు వెన్న. నూరు హెక్టర్ల వ్యవసాయక్షేత్ర భూమికి సోవియట్ దేశం గత ఏడాది 1,330 కిలోగ్రాముల మాంసమూ (కమేలా తూకంలో), అమెరికాలో 3,300 కిలోగ్రాముల మాంసమున్ను; అలాగే పాలకు అంకెలు వరసగా, 10.1 టన్నులూ, 11.1 టన్నులు.

తల వక్కంటికి మాంసం, పాల ఉత్పత్తిలో అమెరికాను అందుకోడానికై సోవియట్ దేశం, వంద ఎకరాల క్షేత్రభూమికి 4.2 టన్నుల మాంసం (కమేలా తూకం) 14.1 టన్నుల పాలు ఉత్పత్తి చేసి తీరాలి, అన్నారు కృశ్చెవ్. కృశ్చెవ్ యింకా యిలా చెప్పారు: ఇది మనకు గొప్ప విజయమవుతుంది. నిజమే ఈనాడు అమెరికా తనమొత్తం ఉత్పత్తితో పాశ్చాత్య ప్రపంచమంతటిలో బలవత్తరమైనరాజ్యమైంది. వలస దేశాలు అమెరికాను చూసి పూర్తిగా భయపడుతున్నాయి, దానితో పోటీ చేయగలమని అవి కలలోకూడా అనుకో లేవు. కాని, ఒకప్పుడు వెనుకబడిన రష్యాకు చెందిన సోవియట్ దేశ ప్రజలు అధికారాన్ని తమ చేతుల్లోకి తీసుకుని, సామ్యవాద ఆర్ధిక వ్యవస్థను నిర్మించి, భారీ పరిశ్రమలను స్థాపించుకుని అభివృద్ధిచేసి, వ్యవసాయ సమిష్టీకరణ అమలు జరిపి, ప్రభుత్వ క్షేత్రాలను నెలకొల్పుకుని ఈ నాడు తల వక్కంటికి ఉత్పత్తిలో అమెరికాను అందుకుని, దాటిపోవడానికి అవకాశాన్ని సంపాదించుకున్నారు.

ఇంతకు మునుపు పదేళ్ళలో తాము చేయలేమనుకున్నదానిని యిప్పుడు ఒక్క ఏడాదిలో చేయగలమనే నమ్మకంతో వున్నారు సోవియట్ ప్రజలు, అన్నారు కృశ్చెవ్. సోవియట్ ప్రజల ధైర్య సాహసాలంటేనా కిష్టం, అన్నారాయన. అది వాస్తవిక అంచనాలమీదనూ, తమ శక్తిలో విశ్వాసం మీదనూ, సామ్యవాద ఆర్ధిక వ్యవస్థ ప్రయోజనాలమీదనూ ఆధారపడి వుంది. అమెరికా ఐశ్వర్యాన్ని చూసి పెట్టుబడిదారీ రాజ్యాలన్నీ గడగడ వణుకుతున్నాయి, అణగి మణగి వుంటున్నాయి. అలాంటి అమెరికాను అత్యంత ముఖ్యమైన ఆర్ధిక రంగంలో శాంతియుతంగా పోటీకి రమ్మని మనం ధైర్యంగా సవాలు చేయగలుగుతున్నాము. అమెరికాకు తన దేశంలో అమ్ముకోలేని సరుకులను ఇతరులకు మోసంచేసి అమ్మడం అలవాటు. పుచ్చిన గోధుమలు కొందరికి, పాసిన పంది మాంసం మరికొందరికీ అంటగడుతుంది, తన చుట్టూ తిరిగేవాళ్ళూ, తనకు కోపం వస్తుందేమోనని భయపడేవాళ్ళూ దానికి వున్నారు. అయితే మనం సామ్రాజ్యవాద అమెరికా అధిక్యతను యెన్నడూ ఒప్పుకోకుండా సర్వదా గర్వంగా వున్నాము. ఎందుకంటె మన సామ్యవాద దేశం గొప్పతనంలోనూ, ఆధిక్యతలోనూ విశ్వాసం కలిగి వుండడానికీ, వాటిని కళ్లారా చూడడానికీ మనకు కావలసినంత ఆధారముంది.

మాంసం ఉత్పత్తిలో సోవియట్ దేశం 1975 వరకూ అమెరికాను అందుకోలేదని అంచనా వేసిన కొందరు ఆర్థిక శాస్త్రజ్ఞుల అభిప్రాయంతో కృశ్చేవ్ అంగీకరించలేదు. ఈ అంచనాలను విమర్శిస్తూ కృశ్చేవ్ యిలా అన్నారు: సమిష్టి వ్యవసాయ పద్ధతి శ్రేష్ఠత సోవియట్ ప్రజల దేశభక్తి, సామ్యవాద పోటీ ధోరణీవల్ల యీ సమస్యను రాబోవు సంవత్సరాలలో పరిష్కరించడానికీ, ప్రస్తుత పంచవర్ష ప్రణాళిక పూర్తికావడానికి ముందే తలవక్కంటికీ మాంసం, పాలు, వెన్న ఉత్పత్తిలో అమెరికాను అందుకోడానికీ మనకు సాధ్యమవుతుంది మనమీ పోటీలో గెలిచి తీరుతాము అన్నారు కృశ్చేవ్. ఈ విజయం ఉదజని బాంబుకంటె యెక్కువ ప్రభావం కలిగి వుంటుంది.

కృశ్చేవ్ యిలా అన్నారు: సామ్రాజ్యవాదులు యీ "సిద్ధాంతాన్ని" సృష్టించారు. వారిలా అంటున్నారు: సోవియట్ దేశానికి ఉదజని బాంబు వున్నది. అలాగే అమెరికాకు కూడా వున్నది. అలాగే బ్రిటన్‌కు కూడా వున్నది. ఉదజని అసాధారణమైన శక్తిగల ఆయుధం కాబట్టి ఏవొక్కపక్షమూ దానిని ప్రయోగించదు, కాని అవి ఒకదానినొకటి బెదరిస్తూ, ప్రచ్ఛన్న యుద్ధాన్ని సాగిస్తూ, "యుద్ధమూకాదు శాంతికాదు" అనే సూత్రం మీద వ్యవహరిస్తూ వుంటాయి. ఈ దేశంలో మనం యీ సూత్రాన్ని వ్యతిరేకిస్తున్నాము. మనం శాంతినీ, అణు, ఉదజని ఆయుధాల నిషేధాన్నీ వాంఛిస్తున్నాము. యిందులో మనతో చేరవలసిందని అమెరికా బ్రిటన్‌లకు మనం విజ్ఞప్తి చేస్తున్నాము. మనం పెట్టుబడి దారీ ప్రపంచాన్ని బాంబులతో పేల్చివేయబోవడంలేదు. తలవక్కంటికీ మాంసం, పాలు, వెన్న ఉత్పత్తిలో మనం అమెరికాను అధిగమించినట్లయితే, ఇంతవరకు లేని అత్యంత శక్తివంతమైన టార్పెడోతో పెట్టుబడిదారీ వ్యవస్థ మూలస్థంభాలను దెబ్బకొట్టినవాళ్ళ మవుతాము.

అప్పుడు, కార్మికవర్గం ఏమిచేయగలదో మన ప్రతికక్షులు ఆలోచించేటట్లు చేదాము. జార్‌ల హీనమైన వారసత్వాన్ని పొందిన మన దేశ కార్మికులు ఎలా వివిధ జాతుల ప్రజలను ఉత్తేజపరచి, ఒకే కుటుంబంగా వారిని సంఘటిత పరచి, వారి సంస్కృతులనూ, ఆర్థిక రంగాలనూ అభివృద్ధిచేయగలిగారో, అత్యంత అభివృద్ధిపొందిన పెట్టుబడిదారీ దేశాల శక్తికి మించినపని అయిన బ్రహ్మాండమైన పురోగతిని నలభై ఏళ్ళలో ఎలాసాధించ గలిగారో, ప్రతివారు చూడగలిగేట్టు చేదాము. సోవియట్ ప్రజలు యింకా బాగా జీవించాలి. వారికి మరింత ఎక్కువగా సాంస్కృతిక సౌకర్యాలు, భౌతిక విలువలు, మంచి గృహవసతీ వుండాలి. వారు తమ దేశానికీ, తమ పరిశ్రమలకూ, తమ భూమికీ యజమానులు. ఉత్పత్తి సాధనాలన్నీ వారి చేతుల్లోనే వున్నాయి; లెనిన్ సూచించిన కమ్యూనిజం సాధన అనే అంతిమ లక్ష్యాన్ని అందుకోడానికి వారు ఆత్మ విశ్వాసంతో పురోగమిస్తున్నారు.

సమిష్టిరైతుల ప్రయివేటు పాడిపంటలనుండి వ్యవసాయక ప్రొక్యూరుమెంట్లు చేసే పద్ధతిని 1958 జనవరి 1వ తేదీనుండీ రద్దు చేసే విషయం సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ, సోవియట్ ప్రభుత్వమూ ఆలోచిస్తూందని కృశ్చేవ్ తెలియజేసారు. (యీ ప్రొక్యూరుమెంట్ల కోటాలు 1953లో బాగా తగ్గించబడ్డాయనీ కృశ్చేవ్ జ్ఞాపకం చేశారు).

ఇది మనకు గొప్ప విజయమనుకుంటాను అన్నారు కృశ్చేవ్. ఇది కేవలం ఆర్థిక విజయమేకాక రాజకీయ విజయం కూడాను. మన ఆర్థిక వ్యవస్థను పురోగమింపజేయడానికీ, ప్రజల సంక్షేమాన్ని పెంపొందింపజేయడానికీ మనం చేసే కృషి సందేహాశీలురైన వారి మనసులపై అన్నిటికంటెకూడా ఎక్కువ ప్రభావం చూపుతుంది అన్నారాయన. పెట్టుబడితో సాగే పోరాటంలో అటువంటివారు నానాటికీ ఎక్కువగా మన పక్షానికి, మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతం వేపుకు, కార్మికవర్గం పక్షానికి వస్తారు.

ముగింపులో కృశ్చేవ్ యిలా చెప్పేరు: మన అంతర్జాతీయ విధానం బాగుందని మనం భావిస్తున్నాము. సోవియట్ ప్రభుత్వం చాల విదేశ రాజ్యాల అధిపతులకు వ్రాసిన లేఖలు మీరు చదివే వుంటారు. అన్నిటికంటె ముఖ్యంగా ప్రపంచశాంతిని బలపరిచే లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని సోవియట్ ప్రభుత్వం ఆ లేఖలలో అత్యంత ముఖ్య అంతర్జాతీయ సమస్యలపై తన అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా తెలియజేసింది. సోవియట్ ప్రభుత్వ శాంతి విధానాన్ని సమస్త ప్రపంచ అభ్యుదయ మానవకోటి బలపరుస్తూంది.

మనం శాంతిని వాంఛిస్తున్నామంటే, దానికోసం పోరాడుతున్నామంటే మన దేశం బలహీనంగా వుండడంవల్ల కాదని అందరికీ తెలుసును. సామ్రాజ్యవాద శిబిర ముఠానాయకులూ, అన్నిరకాల యుద్ధోన్మాదులూ మన శక్తినీ బలాన్నీ గుర్తిస్తున్నారు, గ్రహించగలుగుతున్నారు. మనం మన శాంతియుతమైన, దృఢమైన విధానాన్ని అనుసరిస్తూ వెళ్ళినట్లయితే అప్పుడు అన్నిరకాల దుస్సాహసాన్వేషకులు మన సరిహద్దు లెక్కడున్నాయో, సరిహద్దులేకాక మన ప్రయోజనాలు కూడా ఎక్కడున్నాయో బాగా జ్ఞాపకముంచుకుంటారు.

ఇందుకోసం మనకు కావలసినదేమిటి? ప్రపథమంగా మన పరిశ్రమలు జయప్రదంగా అభివృద్ధి కావడమూ, మన వ్యవసాయం పురోగమించడమూ కొనసాగాలి. మనపార్టీ ఎల్లప్పుడూ ఏక ఖండముగా సంఘటితమై వుండడం అవసరం, ప్రజలతో నిత్యం ఎక్కువగా సంబంధాలు పెట్టుకోవడం అవసరం; ఇంతవరకు ఎల్లప్పుడూ చేస్తున్నట్టుగానే మనస్ఫూర్తిగా పార్టీని ప్రజలు నిత్యం బలపరుస్తూ వుండడం అవసరం. సామ్యవాద దేశాలమధ్య మైత్రి పెంపొందడం కూడా అవసరమే.

మన భౌతిక, ఆత్మిక అవకాశాలు సక్రమంగా వినియోగించబడినట్లయితే యీ దేశం అపూర్వమైన స్థాయిని సాధిస్తుంది; పెట్టుబడిదారీ దుష్ట శక్తులేవీ కూడా కమ్యూనిజం వైపుకు జయప్రదమైన మన పురోగతిని అరికట్టజాలవు.



గోధుమ పంట కోతకు వచ్చినప్పుడు కట్టు తెగి పెలుబికే కర్షకానందాన్ని ప్రతిబింబించే, పంజాబ్ జాతీయ నృత్యం భంగ్రా

చాలామంది భారతీయ విద్యార్థులు, పత్రికా రచయితలు, గాయకులు, క్రీడాకారులు, వివిధ యువజన సంఘాల ప్రతినిధులూ 1955 లో జరిగిన వార్సా యువజనోత్సవంలో పాల్గొన్నారు. వీరు పాల్గొనడం అన్నది గొప్ప ఫలితాన్నిచ్చింది. "అహో, అది అంత అద్భుతంగా వుందా? నీగ్రో డాన్సులు, గిప్సీ సంగీతం, చైనీస్ గారడీలూ, బ్రెజీలియన్ సొనతా పాటలు, ఫ్రెంచి, జర్మన్ మార్చింగ్ పాటలూ, జపానీస్ క్రీడలూ జరిగాయని విన్నానే! వచ్చే ఉత్సవం ఎప్పుడు జరుగు

# నేనూ పాల్గొనవచ్చా?

## బల్వంత్ గార్గీ

తుంది?" అని నిట్టూర్చారు, వార్సా ఉత్సవానికి వెళ్ళని వాళ్ళు.

వచ్చే ఉత్సవం ఎక్కడ జరుగుతుందంటే—మాస్కోలో।

నలభై ఏళ్ళ ప్రాయపు ఒక వార్తాపత్రికా విలేఖరి నాతో యిలా అన్నాడు: "నేను మాస్కోకు వెళ్ళవచ్చునా? ఇప్పుడు నా వయసు నలభై ఏళ్ళు. మొదటి ఉత్సవపు రోజుల్లో నా వయసు ముప్ఫయ్యేళ్ళు. కాని తెలియకపోవడంవల్ల వెళ్ళలేక పోయాను. బుకారెస్టులో జరిగిన మూడవ ఉత్సవం నాటికి నా వయసు ముప్ఫయి నాలుగేళ్ళు. అక్కడికి వెళ్ళే హక్కు సంపాదించడానికి ముందర, గ్రామీణ యువజనుల శ్రేయస్సుకోసం నేను కృషిచేయాలని అనుకున్నాను. నేను గత ఆరేళ్ళుగా కృషిచేస్తున్నాను. ఇప్పుడు బహుశా నా వయసు దాటిపోయి వుండవచ్చును. కాని 18 ఏళ్ళ వయసు మాత్రమే గల నా కుమారుడు వెళ్తే బాగుంటుంది."

బట్టతలతో వున్న పార్లమెంటు సభ్యుడొకాయన నాతో అన్నాడుగదా—"నేను వెళ్ళొచ్చా? నా వయసు ఏభై మాత్రమే. నాది యువక హృదయం. నేనెందుకు వెళ్ళకూడదు?" అని.

అంతర్జాతీయ ఊరేగింపు దినంనాడు మాస్కోలో ధరించేందుకు, మొదటిసారిగా తమ ప్రాంతపు దుస్తులను తాము కుట్టించుకున్నామని చాలామంది విద్యార్థులు నాతో చెప్పారు.



# 6వ ప్రపంచ

భటిండాలో—యిది పంజాబ్‌లోని ఒక చిన్న నగరం—ఆరు మాసాల క్రితం యువజన సంఘం నెలకొల్పబడింది. జిల్లా యువ జనోత్సవానికి ఎనిమిది వేలమంది వచ్చారు. రంగురంగుల తలపాగాలతోనూ, తహ్మద్‌లతోనూ కర్షక యువకులు వచ్చి, భంగ్రా నృత్యం చేశారు, ఫల్కారీలు ధరించి రైతాంగనలు మద్దెలమీదా, కంచుగంటలు కట్టిన పెద్ద యినుప పూచలుగల ఒక ప్రాచీన వాద్యమైన చిమ్టామీదా వాయిస్తూ పాడారు. నృత్యాలూ, నాటకాలూ, పరుగుపందాలూ, ఆటలూ మొదలైన సాంస్కృతిక ప్రదర్శనలు జరిగాయి. పురపాలక సంఘ సభ్యులు—వీరందరూ ముప్ఫయ్యయిదుకు లోపువారే—ఉత్సవ సంఘ సభ్యులు. నగరం పూలతోనూ, రంగురంగుల గేట్లతోనూ అలంకరింపబడింది. సుమారు రెండువందల మంది బాలబాలికలు మాస్కోకు వెళ్ళడానికి సన్నాహం చేస్తున్నారు. చిన్న నగరంనుండి అంతమందా!

వివిధ రాష్ట్రాలలో ఉత్సవసంఘా లేర్పడ్డాయి. కొన్నిచోట్ల జిల్లా ఉత్సవాలు జరిగాయి. మాస్కోకు ప్రతినిధులను ఎంచడానికి ముందుగా బొంబాయిలో రాష్ట్ర ఉత్సవం జరుగుతుంది.

ఆరవ ప్రపంచ యువజన ఉత్సవంకోసం జాతీయ సన్నాహ సంఘాలు ఏర్పాటు చేయబడుతోంది. దీనిలో దేశంలోని అన్ని రాజకీయ అభిప్రాయాలకు, సాంస్కృతిక బృందాలకూ చెందిన యువజన సంఘాలు పాల్గొంటాయి.

అన్ని ప్రాంతాలకూ, వృత్తులకూ భాషలకూ చెందిన వారంతా అడుగుతూ వున్నది "నేను ఉత్సవంలో పాల్గొనవచ్చా?" అని.

గిద్దా అనే యువతీ నృత్యాన్ని ప్రదర్శిస్తోన్న పంజాబీ బాలికలు



# యువజనోత్సవం



మాస్కోలో యీ ఏడాది జూలై 28 నుండి ఆగస్టు 11 వరకూ జరుగనున్న ఆరవ ప్రపంచయువజన విద్యార్థి ఉత్సవాన్ని, అన్నితర గతులకూ చెందిన బొంబాయి యువజనులు హృదయ పూర్వకంగా ఆమోదిస్తున్నారు. ఇది రేకెత్తించిన ఉత్సాహమూ, శాంతి స్నేహాల, అవగాహన పరస్పర సహకారాల ఉదాత్త ఆదర్శంపట్ల ప్రజల అండదండలూ, బొంబాయి సన్నాహక సంఘ నిర్మాణంలో బాగా ప్రతిబింబించాయి. ప్రముఖ కాంగ్రెసు నాయకుడూ, బొంబాయి ప్రముఖపౌరుడూ అయిన శ్రీ సలెభోయ్ అబ్దుల్ కాదర్ అధిపత్యానగల బొంబాయి సన్నాహ సంఘంలో బొంబాయిలోని వివిధ సాంస్కృతిక, క్రీడా, యువజన సంఘాలున్నాయి. సంఘంలో ప్రాతినిధ్యం గల, లేదా పరిశీలకులుగా ఉత్సవాన్ని బలపర్చుతోన్న సంస్థలలో ప్రముఖమైనవి జూహూ ఆర్ట్ థియేటర్, నేషన్స్ లీగ్ ఆఫ్ పెన్ ఫ్రెండ్స్, భారత సేవక సమాజ్, ఇండియా కల్చర్ లీగ్, ఫ్రెండ్స్ క్లబ్, బొంబే సిటీ యూత్ లీగ్, నేషనల్ యూనియన్ ఆఫ్ స్టూడెంట్స్, కేరళీయ కళా మండలం, సహీద్ గ్రంథాలయం, అజాద్ ప్రగతి మండల్, దాదర్ యువకసభ, విలేపార్లె యూత్‌లీగ్, గోవా విద్యార్థిసంఘ, బాలోద్యాన్, జాతీయ సంస్కృతీ కేంద్రం, సిరస్తిక్ సమర్థ వ్యాయామ మండల్, బొంబాయి రాష్ట్ర సైకిలింగ్ సంఘం, అఖిల భారత కళాకారిణుల సంఘం, నవ్‌జవాన్ పార్టీ, భారతీయ ప్రజానాట్య మండలి, బొంబాయి యువజన గాన బృందం, ప్రబర్తికేంద్ర, భారత-సోవియట్ సాంస్కృతిక సంఘం, గోవన్ కళా, సంస్కృతీ సంఘం, సుర్ సింగర్ సమ్సద్, బాల్కంజీ బారీ, నవభారత కళాసంస్కృతీ సంఘం, గుర్జర్ గార్బ మండల్. ఈ సంఘానికి డాక్టర్లు, ఇంజినీర్లు, మేధావులూ, పత్రికా రచయితలు, రచయితలూ, సంఘ సేవకులూ, కార్యాలయోద్యోగులూ, క్రీడాకారులూ, ఫిల్మకళాకారులూ బాగా తోడ్పడుతున్నారు.

ఈ సంఘం వెంటనే మాస్కో ఉత్సవం గురించి ప్రచారం చేయడానికి పూనుకుని, చాలా కార్యక్రమాలను ఏర్పరిచింది.

ఏప్రిల్ 24న సంఘం, బాండుంగ్ దినోత్సవాన్ని జరపడానికి సుందరబాయ్ హాలులో ఒక యువజన సమావేశం జరపబడింది.




ఆఫ్రో-ఏషియన్ సంఘీభావం, ప్రపంచ శాంతి దినోత్సవంగా, 24 ఏప్రిల్‌న సుందర్‌బాయ్ మందిరంలో జరిగిన బాండుంగ్ దినోత్సవ సభలో, ఉపన్యసిస్తోన్న బొంబాయి సన్నాహ సంఘాధ్యక్షుడు శ్రీ సాలెభాయ్ అబ్దుల్ ఖాదర్

దీనికి చాలామంది ప్రముఖులూ, వెయ్యిమందికి పైగా యువతీ యువకులు హాజరయ్యారు. ఇది చాలా జయప్రదంగా జరిగింది.

ఉత్సవ లక్ష్యాల ప్రచారంకోసం సంఘం ఒక కొత్త పద్ధతిని అవలంబించి ఏప్రిల్ 24 నుండి 27 వరకూ యువజన పతాక దినాలుగా జరిపాయి. యువకులు నగరంలో తిరిగి యిరవై వేల ఉత్సవ పతాకాలను పంచిపెట్టి, సంఘానికి నిధిని సేకరించారు. ప్రజలు ఉదారంగా విరాళా లిచ్చారు.

ప్రజాభిమతాన్ని అనుసరించి సంఘం ఏప్రిల్ 27న బొంబాయి హార్బరులో నౌకా విహారాన్ని ఏర్పాటు చేసింది. ఉత్సవ పతాకాల

# బొంబాయి యువజనుల సన్నాహాలు

**ఎస్. కె. చక్రవర్తి**

*ఉత్సవ సన్నాహ కార్యసంఘ కార్యదర్శి.*

తోనూ, బెలూన్లతోనూ అందంగా అలంకరింపబడిన నౌకలో సుమారు నాలుగువందల మంది యువతీయువకులు హాయిగా పాడుతూ, ఆడుతూ మూడు గంటలు ఆనందించారు.

మాస్కోలోని మన స్నేహితులు ఉత్సవంకోసం చేస్తోన్న సన్నాహాలను బొంబాయి యువజనులకు తెలియజేసేందుకు, "సోవియట్ దేశపు జాతుల మధ్య 1956 లో జరిగిన ఆటల పోటీలు" అన్న ఫిల్మ చూపబడింది. సుమారు 800 మంది యీ ప్రదర్శనకు వచ్చారు.

ప్రపంచ ఉత్సవ లక్ష్యాలలో ఒకటైన కళా సంస్కృతుల అభివృద్ధి ననుసరించి, సన్నాహ సంఘం వివిధ సంస్కృతీ విషయాల పోటీలను జరిపింది. పోటీలలో సంగీతమూ, ఛాయాచిత్ర గ్రహణమూ, చిత్రలేఖనం, వక్తృత్వం, వినోద వేషధారణం, రంగవల్లి, కుట్టుపని వున్నాయి. గెలుపొందినవారికి యోగ్యతాపత్రా లివ్వబడతాయి. వాటిలో ఉత్తమమైన వస్తువులు మాస్కో ఉత్సవానికి పంపబడతాయి.

మే 4వ తేదీని సన్నాహ సంఘం "భారతదేశపు జానపద గీతాల, నృత్యాల" ప్రదర్శనను ఏర్పాటు చేసింది. దీనికి దర్శకుడు ప్రఖ్యాత సంగీత దర్శకుడు సలిల్ చౌధురి. ఈ ప్రదర్శనం చాలా బాగుంది, హిందీలో "ప్రపంచ యువజన గీతం"తో ముగిసింది.

(మిగత 13వ పుటలో)

సలిల్ చౌధురీ దర్శకత్వంలో, ఆరవ ప్రపంచ యువజన విద్యార్థి మహోత్సవ బొంబాయి సన్నాహ కార్య సంఘాధ్వర్యంలో, బొంబాయిలోని సుందర్‌బాయ్ మందిరంలో, 4 మే 1957న, బొంబాయి బృందగాన సభ్యులు చేసిన హోలీ జానపద గీత, నృత్య ప్రదర్శన

మాస్కోలో జరుగనున్న ఆరవ యువజనోత్సవంలో పాల్గొనను, బొంబాయి బృందగాన సభ్యులు సముత్సాహంతో నిరీక్షిస్తున్నారు







ఛాయా చిత్రకారుడు
పెత్కోవ్



★

సభామందిరంలోని
ఒక దృశ్యము



అజర్‌బైజాన్లోని మహిళోద్యమ
ప్రముఖ నిర్మాతలలో ఒకరైన
బైరాన్ బైరమోవా ప్రసంగిస్తూ

# అజర్‌బైజాన్ రిపబ్లిక్ ద్వితీయ మహిళా సభ

**టి. స్వెత్‌కోవా**

సోవియట్ అజర్‌బైజాన్ ముఖ్యపట్టణమైన బాకూలో, రిపబ్లిక్కు ద్వితీయ మహిళా సభ యిటీవలనే జరిగింది. మహాసభ ప్రతినిధులైన 745 మంది మహిళలు యీ రిపబ్లిక్కులోని వివిధ నగరాలకూ, ప్రాంతాలకూ చెందినవారు. అజర్‌బైజాన్ స్త్రీల ఉత్తమ ప్రతినిధులు వీరు. వారిలో 19 మంది సామ్యవాద శ్రమ వీరవనితలున్నారు, బస్తి బగిరోవా, షమయా గసనోవా మొదలైనవారు. పెద్ద పత్తి పంటలను పండించినందుకు రెండుసార్లు వీరికి యీ ఉన్నత బిరుదు లభించింది. వ్యవసాయ ప్రవీణురాలు వలిదా తుతయిక్ (డాక్టర్ ఆఫ్ బయాలజీ) తో బాటుగా 164 మంది విజ్ఞాన శాస్త్రజ్ఞులున్నారు. వారిలో ఎక్కువ మంది కార్మికులు, కర్షకులు, ఉపాధ్యాయులు, వైద్యులు వున్నారు.

మహాసభలో ఉపన్యసిస్తూ అజర్‌బైజాన్లోని చాలా పాత మహిళోద్యమ నిర్మాతలలో ఒకరైన బైరాన్ బైరమోవా యిలా చెప్పారు:

"అజర్‌బైజాన్ మహిళలం మొదటిసారిగా సమావేశమైన 1921 వ సంవత్సరం నాకు జ్ఞాపకం వుంది. మాలో చాలమంది అక్షరాలు రానివారు, వృత్తిలేనివారు. కానియీనాడు...." అని సభవేపు చూపుతూ. "మీరు విద్యావంతులు సంపూర్ణ హక్కులుగల స్వతంత్ర ప్రజలు. ఇటువంటివారు పూర్వం అజర్‌బైజాన్లో లేరు"

విప్లవానికి పూర్వం అజర్‌బైజాన్లో 116 మంది వైద్యులుండేవారు. వారిలో స్త్రీ ఒక్కరూ లేరు. కాని యిప్పుడున్న 6,417 మంది వైద్యుల్లో నాలుగువేలమందికి పైగా స్త్రీలు. వారిలో చాలామంది గొప్ప గౌరవాదరాలను పొందినవారు. మహాసభకు ప్రతినిధిగా వచ్చిన ఉమ్నిస్ ముసబెకోవా (డాక్టర్ ఆఫ్ మెడిసిన్) పేరు చెబితే చాలు. ఈమె వందలాది మందికి దృష్టిదానం చేసింది. ఇరవై ఒక్క వేలమంది మహిళలు ఇంజినీర్లుగానూ, సాంకేతిక విషయజ్ఞురాండ్రుగానూ, ప్రవీణులుగానూ వివిధ రంగాలలో రిపబ్లిక్కు ఫ్యాక్టరీలలోనూ, మిల్లులలోనూ, విజ్ఞానశాస్త్ర సంస్థలలోనూ పని చేస్తున్నారు.

నలభై మందికిపైగా ప్రతినిధులు మహాసభలో, తాము తమపనిలో ఎదుర్కొనే కష్టాల గురించి, తమ విజయాల గురించి ప్రసంగించారు. రిపబ్లిక్కులో, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో యింకా బాలోద్యానవనాలూ, శిశుపోషణాలయాలూ చాలినన్ని లేవు. కొన్నిచోట్ల స్త్రీలను పెద్ద పదవులకు భయభయంగా పంపడము జరుగుతోంది. కాని వారు పెద్దపనులు చేయడానికి అభిలషిస్తున్నారు, చేయగలరు; బాల సంస్థల నిర్మాణాన్నీ, దుకాణాల పనినీ, భోజనశాలల పనినీ వారు అజమాయిషీ చేయగలరు, ప్రజలలో సాంస్కృతిక, విద్యావ్యాపన కృషిని చేయగలరు.

మహాసభ వేదికపైని యిదంతా చెప్పి, తమ రిపబ్లిక్కు యింకా పురోభివృద్ధి గాంచడానికి పట్టుదలగా, శక్తివంతంగా పని చేయవలసిందిగా స్త్రీలకు విజ్ఞప్తి చేయబడింది.

# జూన్ 1-అంతర్జాతీయ బాలరక్షణ దినోత్సవం

అనతోలీ అలెస్కిన్ (సోవియట్ రచయిత)

ఇది జరిగింది 1919లో. కిటికీ రెక్కలకు గట్టి మంచుముక్కలు కొడుతూ వున్నాయి, మంచు పోతకు చెట్లు విరుగుతూన్న శబ్దం వినిపిస్తోంది ఒక సాయంత్రం. వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్ పిల్లలకోసం ఏర్పాటు చేయబడిన ఫిర్ చెట్టు పార్టీకని సొకొల్నికికి వెళ్లారు. వినాశనం జోద్భూధ నూతన సోవియట్ రిపబ్లిక్కుపైని దాడి చేస్తున్నాయి. ఈ కష్టాలిలా వున్నప్పటికీ, లెనిన్ పిల్లలకోసం కొన్ని ఆటవస్తువులను సంపాదించగలిగారు.

తన మహాహృదయంలోని ప్రేమ అంతటితో లెనిన్ పిల్లలను ప్రేమించారు. ఈ ఉన్నత ప్రేమను, ప్రజలపట్ల ఆర్ద్రతనూ ఆయన ప్రజలకు సంక్రమింప జేశారు. అక్టోబరు మహావిప్లవపు తొలిరోజుల నుండీ పిల్లలపట్ల శ్రద్ధాదరాలు, సోవియట్ సమాజపు పవిత్ర శాసనం అయ్యింది.

....వేసవిలో రహదారి వెంబడిని ఏదో అడవిలోకో, కొండలలోనికో వెళ్తొంటే, పిల్లల పాటలతోనూ, కేరింతలతోనూ ప్రతిధ్వనించే చక్కని చిన్న సీలపు నగరాలు తప్పక కంటబడతాయి. ఫాక్టరీలకూ, పరిశ్రమలకూ, యితర సంస్థలకూ చెందిన బాలసంఘ శిబిరాలివి. ఇక్కడనే మా పిల్లలు తమ వేసవి సెలవులను గడుపుతారు.

దిట్టమైన యిటుకయిళ్ళు. బీడు భూముల లోని కొత్త గ్రామాల్లో అవతరించడం మొదలైంది. ఇక్కడ కొత్తగా వచ్చినవారి తెల్లని గుడారాలు మనకు కనిపిస్తాయి. నిర్మింపబడిన మొదటి కట్టడాలలో ఒకటి, వాటన్నిట్లోకీ అందమైనదీ విశాలమైనది పాఠశాల. ఒక చిన్న పట్టణంలోని మధ్య చౌకులో ఒక బ్రహ్మాండమైన అద్భుత భవనం, ముందున స్తంభాలతో మనకు కనిపిస్తుంది. అది స్థానిక ప్రజలకు గర్వకారణమైనది. మీరు నిర్భయముగా అది పిల్లలకు చెందిన భవనమని ఊహించవచ్చును. అది బాలసంఘ భవనం, యిక్కడ సోవియట్ బాలలు వివిధ కేంద్రాల కృషిలో పాల్గొంటూరు, కవిత్వంవ్రాయడమూ, కథలు చెప్పడమూ, బొమ్మలు గీయడమూ, నృత్యం చేయడమూ, పాడడమూ నేర్చుకుంటూరు. ఇది వారి క్రీడానగరం, యిక్కడ వీధులకు బదులుగా వాలీ-బాల్ కోర్టులూ, ఫుట్ బాల్ ఆటస్థలాలూ, అద్దంలాంటి యీత చెరువులూ వున్నాయి....

కాని నిర్మింపబడిన దానంతటి గురించి, పిల్లలకోసం ప్రజలు సృష్టించిన దానంతటి గురించి చెప్పడానికి పూనుకోవడం అసాధ్యమైన పని. "మంచివన్నీ—పిల్లలకోసం!" సోవియట్ దేశంలో వ్యాపించిన నినాదం యిది. బాలసంఘ సభ్యులకోసం భవనాలను నిర్మించడమూ, పిల్లల ఆట స్థలాలను కట్టడమూ, పార్కులను వెయ్యడమూ మాత్రమే కాదు, మాపని. పిల్లలను, ఉన్నతమైన, పరిశుద్ధమైన అదర్శవంతులుగా పెంచడానికి కూడా మేము ప్రయత్నిస్తాము.

పిల్లలపట్ల శ్రద్ధ, ప్రపంచంలో శాంతి రక్షణపట్ల, దానిని దిట్టపరచడంపట్ల ఎక్కువ శ్రద్ధ—యివి విడదీయడానికి వీలులేని విషయాలు, యుద్ధంలో యెప్పుడూ పిల్లలు మొదట అతి నిస్సహాయంగా బలి అవుతుంటారు. విమాన దండయాత్రను సూచించే భయంకరమైన బాకారూతవల్ల, పడుతోన్న బాంబుల మృత్యుగర్జనవల్ల ఒక్క బిడ్డకూడా నిద్రనుండి లేవకుండా చేయడానికి మేము కలగంటున్నాము. మేము శాంతిని గురించి కలలు కనడం మాత్రమే కాదు, యావచ్ఛక్తితో యిందుకు కృషిచేస్తున్నాము కూడా.

శాంతికోసరం, పిల్లల జీవితంకోసం, సౌఖ్యంకోసం సోవియట్ స్త్రీలు—తల్లులూ, శాంతికై కృషిచేసేవారూ ప్రపంచ స్త్రీలందరికీ, తల్లులందరికీ, మహిళా సంఘాలన్నిటికి విజ్ఞప్తి చేశారు. నిరాయుధీకరణ అనే పవిత్రాశయం కోసం, పరమాణు, థెర్మో న్యూక్లియర్ ఆయుధాల నిషేధంకోసం తాము సాగిస్తోన్న పోరాటాన్ని బలపర్చమంటూ సోవియట్ మహిళలు మానవహృదయం గల వారందరికీ విజ్ఞప్తి చేశారు, ఆవేశభరితమైన మా మహిళల దివ్యవాణి, ప్రపంచంలో అన్ని ప్రాంతాల్లో వినిపించింది.

శాంతిపట్ల నిర్మాణంపట్ల ప్రేమనూ, వినాశనంపట్ల, యుద్ధంపట్ల, మనిషిని మనిషి బానిస చేయడంపట్ల పవిత్రమైన, రాజీలేని ద్వేషాన్ని కూడా మేము మా పిల్లలలో రేకెత్తిస్తాము.

ఒర్యోల్ మండలంలోని బోల్కోవ్ నగరంలోని ఒక పాఠశాలలో ఐదోతరగతి విద్యార్థిని అల్యా సవొస్తినా యిలా వ్రాస్తోంది: "పిల్లలందరికీ లాగనే నాకూ యుద్ధం అక్కరలేదు. యుద్ధం యెటువంటి భయంకరమైన పనులు చేసిందో మా నాన్నగారు నాకు చెప్పారు. నాకు యుద్ధం వద్దు!"

సోవియట్ ప్రచురణాలయాలు ప్రతి ఏడాది పిల్లలకోసం లక్షలాదిగా పుస్తకాలను ప్రచురిస్తాయి. వాటిలో కొన్ని యెంతో మంచి శైలిలో వ్రాసి వుండవచ్చును, కొన్ని బాగా వుండకపోవచ్చును. కాని వాట్లో మానవ ద్వేషాన్ని బోధించే ఒక్క పుస్తకంకూడా, ఏ పుస్తకంలోనైనా ఒక్క పంక్తికూడా మీకు కనిపించదు. మానవుని పట్ల ప్రేమ, ప్రకృతి పట్ల ప్రేమ, పనిపట్ల ప్రేమ — బాల పాఠకులకోసరం వేసే సోవియట్ ప్రచురణ లన్నిట్లో నొక్కి చెప్పబడే విషయా లిటువంటివి.

"భవిష్యత్తు బాలలది. ప్రకృతి శాసనమది. మా తరవాత పనిలో చేరేవారు పిల్లలు, వారు మా నిజవలు, చేసిన ప్రతి ఒక్కదానికీ, చేయబడుతోన్న ప్రతిఒక్కదానికీ వారు న్యాయమైన వారసులు." ఈ మాటలను అన్నది శ్రామిక వర్గ మహా రచయిత అలెక్సీ మాక్సిమోవిచ్ గోర్కీ.

# సోవియట్ దేశ బాలసంఘపు 35వ వార్షికోత్సవం

## త్రైసియా మాత్వేయేవా

"పయొనెర్‌స్కయా ప్రవ్దా" సంపాదకురాలు

సోవియట్ దేశం అంతటా సకల నగరాలలోనూ, గ్రామాలలోనూ, వీధుల్లో, పాఠశాలల్లో, వస్తు ప్రదర్శనాలయాల్లో, నాటకశాలల్లో, క్రీడా స్థలాల్లో మెడకు ఎర్రని పీలికలు కట్టుకునివున్న బాలబాలికలు కనిపిస్తారు. వీరు బాలసంఘ సభ్యులు. సోవియట్ దేశంలో ప్రతి పాఠశాలకూ ఒక బాలసంఘ ద్రుజీనా (సేన) వుంది. ప్రతి తరగతికీ ఒక బాలసంఘ బృందం వుంది.

పిల్లలే తమలో బాగా చురుకుగా, ఉల్లాసంగా, పొరవగావున్న బాలసంఘ సభ్యులను యీ బృందానికీ, ద్రుజీనాకు సంబంధించిన కార్య నిర్వాహక వర్గాలకు ఎన్నుకుంటారు, వాళ్ళ బాలసంఘ కృషిని నడిపేందుకు, బాలసంఘ ద్రుజీనాల, బృందాల నాయకత్వంలో యువజన సంఘం (యువ కమ్యూనిస్టు సంఘం) నియమించిన బాలసంఘ నాయకులూ, యువతీ యువకులూ వుంటారు. తమ స్నేహితులలో ఎవరెవరిని బాలసంఘ సభ్యులుగా చేర్చుకోవాలన్న దానిని పిల్లలు తామే నిర్ణయించుకుంటారు. బాలసంఘ సభ్యులే తమ కార్యకలాపాలను నిర్ణయించుకుంటారు, రాబోయే కార్యకలాపాలను ఏ బృందం, ఏ ద్రుజీనా ఏర్పరచాలన్నదానిని నిర్ణయిస్తారు. వారు తమ పతాకధారులనూ, బాకాలూదేవారినీ, డోలు వాద్యకారులనూ, తమ పత్రికల సంపాదకులనూ, పాఠశాల రేడియో ప్రసారాల సంపాదకులనూ ఎన్నుకుంటారు.

బాలసంఘమనే పిల్లలసంస్థ సోవియట్ దేశంలో గత 35 ఏళ్ళుగా వుంటోంది. అనేక మంది ప్రఖ్యాత సోవియట్ శాస్త్రజ్ఞులూ, ఇంజినీర్లూ, క్రీడా వేత్తలు పరిశ్రమలలోనూ వ్యవసాయంలోనూ అగ్రగాములూ తమ బాల్యంలో బాలసంఘ సభ్యులే.



### పుట్టు పూర్వోత్తరాలు

తొలి బాలసంఘ బృందాలు మాస్కోలో, 1921 లో నెలకొల్పబడి వున్నాయి. తొందర్లోనే అవి పిల్లల అభిమానాన్ని బాగా చూరగొన్నాయి, వాటి సంఖ్య పెరుగుతూ వచ్చింది.

మాస్కో ఆదర్శాన్ని అనుసరించి దేశం లోని యితర మండలాలలో కూడా ఉక్రెయిన్లోనూ, ఉరల్స్‌లోనూ, వైట్ రష్యా లోనూ, దూరప్రాచ్యంలోనూ బాల బృందాలు ఏర్పరుప బడ్డాయి.









దేశంలోని బాల బృందాలన్నీ ఒకే బాలసంఘంగా 1922 మే 19న సంఘటిత పర్చబడ్డాయి. ఈ రోజు సోవియట్ దేశ బాలసంఘ జన్మదినం.

1923 అక్టోబరు నరికి 75 వేల బాల సంఘాలుండేవి. బాల సంఘ ఉద్యమం వృద్ధి కాజొచ్చింది.

1925 చివరికి బాల సంఘంలో యించుమించుగా పదిహేను లక్షల మంది పిల్లలుండేవారు; యిరవై లక్షలమంది బాలసంఘ సభ్యులు ఆ సంఘపు ఐదవ వార్షికోత్సవాన్ని జరిపారు.

లెనిన్ బాల సంఘంలో ప్రస్తుతం ఒకకోటి 80 లక్షల మంది బడి పిల్లలున్నారు.

ఈ సంవత్సరం సోవియట్ ప్రజలు అక్టోబరు సామ్యవాద మహా విప్లవం 40వ వార్షికోత్సవాన్ని జరపడానికి సన్నాహాలు చేస్తున్నారు. ఈ సంవత్సరాలలో పెరిగి పెద్దవాళ్ళవుతున్న తరం సోవియట్ ప్రజలతో యెప్పుడూ అడుగుకలిపి పురోగమిస్తోంది. దేశ జీవితంలో చురుకుగా యెప్పుడూ పాల్గొంటూనే వుంది. బాల సంఘ చరిత్రనుండి కొన్ని పుటలను యిక్కడ ఉదాహరిస్తున్నాము.

1929. నిరక్షరాస్యతా నిర్మూలనానికి దేశంలో చేయవలసిందెంతో వుంది. బడిపిల్లలైన బాలసంఘ సభ్యులు నగరాలలోనూ, గ్రామాలలోనూ కార్మిక కర్షకుల యిళ్ళకు వెళ్ళి, వారికి పుస్తకాలను యిచ్చేవారు, పిల్లలను బడికిరమ్మని పిల్చేవారు, వయోజనులను క్లబ్బులలో చదువుకోమని చెప్పేవారు. సాయంకాలం బాలసంఘ సభ్యులు క్లబ్బులకు వచ్చి, వయోజనులకు వ్రాయనూ, చదవనూ తొలి పాఠాలు చెప్పేవారు.

1930. కొత్త ఫ్యాక్టరీలు, పరిశ్రమలూ, గనులూ, బ్లాస్ట్ ఫర్నేసులూ దేశంలో నిర్మింపబడుతూ వున్నాయి. "మన పరిశ్రమ కొరకు లోహపు తునకలు" అన్నది, ఆ రోజుల్లో బాలసంఘ సభ్యుల నినాదం. వారు ఆ వాగ్దానాన్ని నిలబెట్టుకున్నారు.

1934. వేలాది బాలబృందాలు ప్రాంతీయ పరిశీలనకు పూనుకున్నాయి. ఖనిజాలను, కొత్తరకాల మొక్కలనూ, ఔషధాలకు పనికివచ్చే మూలికలనూ అన్వేషించారు. ప్రఖ్యాత విజ్ఞానశాస్త్రవేత్త, ప్రకృతి పరివర్తకుడూ ఐ. వి. మిచురిన్ విజ్ఞప్తిపైని దేశం అంతటా కొత్తరకాల మొక్కలకోసం బాలసంఘ సభ్యుల యాత్రలు సాగాయి. ఈ విధంగా బాలలు, విజ్ఞానశాస్త్రజ్ఞులకు సాయపడ్డారు, దేశంలోని యూరోపియన్ భాగంలో, ముఖ్యంగా ఉత్తరాదినీ, ఉరల్స్‌లోనూ మంచుకు తట్టుకునే కొత్తరకాల వ్యవసాయపు మొక్కలను పెంచడంలో.

1939. సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శనం మొదలైంది. ఒక ప్రత్యేక బాలప్రకృతి ప్రేమికుల ప్రదర్శనశాలలో సుమారు నాలుగు వేలమంది బాలసంఘ సభ్యులు బడిలో తమ చదువును తమ దేశ శ్రేయస్సుకుపయోగపడేటట్టు యెంత జయప్రదంగా జోడిస్తున్నారో అన్నదానినీ, పాఠాలద్వారా తాము సంపాదించిన విజ్ఞానాన్ని ఆచరణలోపెట్టడం తాము ఎలా నేర్చుకుంటున్నారో అన్నదానినీ ప్రదర్శించారు.

1940 లో సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శనంలో పాల్గొన్న బాల ప్రకృతి ప్రేమికుల సంఖ్య పదమూడువేలకు పెరిగింది.



## బాల వీరులు

ద్వితీయప్రపంచ యుద్ధ కష్టకాలంలో చదువులో అద్భుత ఫలితాలను చూపడం మాత్రమే కాకుండా, నాజీలతో, యుద్ధ రంగంలో పోరాడేవారికి సాధ్యమైనన్ని విధాలా సాయం చేశారు. దేశం అంతటా లోహపురద్దీని

సేకరించాలనీ, తుపాకులు, గుళ్ళు, టాంకులూ తయారు చేయడానికి అవసరమైన లోహాన్ని సేకరించడంలో తమ విధిని నెరవేర్చాలనీ బాల సంఘసభ్యులు ప్రతిపాదించారు.

సోవియట్ దేశ వీరుల జాబితాలో నిర్భయులైన బాలసంఘ సభ్యులూ, గెరిల్లాలూ అయిన సాషా ఛెకలిన్, ల్యోన్యా గొలికోవ్ పేర్లున్నాయి. బాలసంఘ సభ్యులు కెర్చ్‌కి చెందిన ఒలోద్యా దుబినిన్, వాన్యా ఆంద్రియనోవ్, కోల్యా లియోన్‌త్యేవ్ మొదలైనవారి సాహసిక సైనిక చర్యలు దేశం అంతటా పేరుకెక్కాయి. ఉక్రెయిన్లోని పొక్రొవాస్కోయి బాలసంఘ సభ్యులు ఒకరహస్య బాల బృందాన్ని ఏర్పరిచారు. తమ సైనిక దళాలనుండి వేరుబడిపోయిన సోవియట్ సైనికులను నాజీలకంటబడకుండా వారు దాచారు, హిట్లరైట్లు బానిసలుగా జర్మనీకి తీసుకపోవాలనుకున్న బాలికలను దాచివేసేవారు. ఈ పిల్లలు ప్రజలకు కరపత్రాలను పంచిపెట్టేవారు, శత్రువుల టెలిఫోన్ తీగలను త్రెంపివేసేవారు. సోవియట్ సైనిక దళాలు నాజీలను గ్రామాలనుండి తరిమివేశాక, బాలసంఘ సభ్యులు తమ విముక్తి ప్రదాతలకు బాలసంఘ పతాకాలతో స్వాగతం యిచ్చారు.

ఇటువంటి ఉదాహరణలను ఎన్నింటినో చెప్పవచ్చును.

గత 45 ఏళ్ళలో వివిధ ప్రాయాలకు చెందిన బాలసంఘ సభ్యులు పెరిగి పెద్దవాళ్ళయ్యారు. పెద్దవాళ్ళయ్యాక ప్రతి బృందమూ, తమ తమ్ములకు బాలసంఘ వీరోచిత సాంప్రదాయాన్ని అందజేస్తుంది.

ఇప్పుడు నిరక్షరాస్యులకు చదువు చెప్పవలసిన అవసరంలేదు, బాలసంఘ సభ్యులకు. దేశంలో ప్రతిఒక్కరూ విధిగా సెకండరీ విద్యను పొందాలి. కాని యీనాడు బాలసంఘ సభ్యులు, పిల్లలందరూ బాగా చదువుకోవాలనీ, బడికి వెళ్లాలనీ ఒక ఉద్యమాన్ని సాగిస్తున్నారు. బాలసంఘ సభ్యులు లోహపు రద్దీనికూడా సేకరిస్తారు. భేదమల్లా, దీనిని సేకరించడం తుపాకిగుళ్ళకోసమూ, టాంకుల కోసమూ కాకుండా, బీళ్లు, బంజర్లు సాగుచేసే ట్రాక్టర్లను తయారు చేయడంకోసం జరుగుతోంది.

[illegible]

ఇప్పటికి మూడేళ్ళుగా ముప్ఫయివేల బాలసంఘ బృందాలు తమ మండలాలలో వేసవి యాత్రలనూ, కాలినడక యాత్రలనూ నడుపుతున్నాయి. సెలవులను ఆరోగ్యదాయకంగా ప్రకృతిలో గడుపుతూ బాలలు వివిధ మంత్రివర్గాలూ, విద్యాశాలలూ సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు నిర్దేశించిన కర్తవ్యాలను నెరవేర్చుతూ ఖనిజాలను కనుగొనడమూ, చిన్న నదులను పరిశీలించడమూ మొదలైన





పనులు చేస్తున్నారు.

బాలసంఘాలు పాల్గొనే కార్యకలాపాలన్నిటినీ వివరించడం అసాధ్యం.

బాలసంఘ సేనలకూ, బృందాలకూ బాలసంఘ సభ్యుల కుటుంబాలతోనూ, వారి తలిదండ్రులతోనూ సన్నిహిత సంబంధాలుంటాయి, కుటుంబంలో పిల్లలను సక్రమంగా పెంచేటట్టుగా అవి వారికి తోడ్పడుతాయి. బాలసంఘ సభ్యులు ఆహ్లాదకరమైన సమావేశాలనూ, కాంప్‌ఫైర్లనూ, యాత్రలనూ జరుపుతారు, క్రీడలలో పాల్గొంటారు, సరదాగా వుంటారు.

ఇంజినీరింగ్‌లో ఆసక్తి వున్నవారికి యంత్రాల నమూనాలు తయారుచేసే అవకాశం కల్పింపబడుతుంది, ప్రకృతిలో ఆసక్తిని కనపర్చే వారు బాల ప్రకృతి ప్రేమికుల బృందంలో చేరతారు. బాల సంగీతప్రియులు, గాయకులు, నర్తకులు, సంగీత పాఠశాలలలోనూ, బాలసంఘ గాన బృందాలలోనూ, నర్తక బృందాలలోనూ తమ ప్రతిభను పెంపొందించుకుంటారు.

బాల సంఘానికి స్వంత నాటకశాలలూ, క్రీడాస్థలాలూ, బాల సాంకేతిక కేంద్రాలూ, బాల ప్రకృతి ప్రేమికుల కేంద్రాలూ వున్నాయి. సోవియట్ దేశం 22 బాలసంఘ వార్తాపత్రికలు, చాలా మాగజైన్లు అన్ని రిపబ్లిక్కుల ప్రజల భాషలలో ప్రచురింపబడుతున్నాయి. వేలాది మంది బడిపిల్లలు రోజూ 2,382 బాలసంఘ భవనాలకూ గృహాలకూ

వెళ్ళుతుంటారు. ఉదాహరణకు లెనిన్‌గ్రాడ్ బాలసంఘ భవనం 710 కేంద్రాలను ఏర్పరిచింది. వీటిలో 12 వేలమంది బాలసంఘ సభ్యులు తమతమ అభిమాన విషయాలలో కృషిచేస్తారు....

వేసవిలో బాలసంఘ సభ్యులు నగరానికి వెలుపల వేసవి శిబిరాలకు వెళ్తారు. బాలసంఘంలో బాలలలో మాతృదేశంపట్ల ప్రేమ, సమిష్టిగా పనిచేయడమూ, ఒకరితో ఒకరు స్నేహంగా వుండడమూ, యితరులను గౌరవించడమూ బోధింపబడుతాయి.

ఈ కేంద్రాలలో జరిగే ఆసక్తిని రేకెత్తించే కృషి, చదువు మీదా, విజ్ఞానశాస్త్రాలమీద అభిలాషను రేకెత్తిస్తుంది, యింజినీరింగు పట్ల, పనిపట్ల యిష్టాన్ని కలిగిస్తుంది.

అందువల్లనే బాలసంఘ సభ్యులు దేశ జీవితంతోజరిగే ఘటన లన్నిటికీ ఆకర్షితులవుతుంటారు, సమిష్టి ప్రయోజనానికి యధారీతిని తోడుపడడానికి ఎప్పుడూ సంసిద్ధులుగా వుంటారు. బాలసంఘ సభ్యులు మిత్రునికి సాయపడడానికికూడా ఎప్పుడూ సిద్ధంగావుంటారు, వారు పెద్దలను గౌరవిస్తారు, వారు శ్రమజీవులుగా, ధీరులుగా, తమ మాతృభూమి ఉత్తమ పౌరులుగా పెరిగి పెద్దవాళ్ళవుతున్నారు.





## బొంబాయి యువజనుల సన్నాహాలు

[7వ పేజీ తరువాయి]

యువజనుల నుండి, ప్రజలనుండి, వివిధ సంస్థలనుండీ ఎక్కువగా ప్రోత్సాహం రావడంవల్ల సన్నాహ సంఘం, రంగ భవన్లో మే 25 నుండి 29 వరకూ బొంబాయి యువజనోత్సవాన్ని ఏర్పరచడానికి నిర్ణయించింది. యువతీయువకులు తమ సృజనాత్మక ప్రతిభను ప్రదర్శించడానికీ, పరస్పర సహకార స్నేహభావాన్ని కలిగించడానికి యీ ఉత్సవం అవకాశాన్ని కలిగించింది. గోపీ కృష్ణ మొదలైన ప్రఖ్యాత నర్తకులు, లిటిల్ బాలెట్రూప్, భారతీయ ప్రజా నాట్యమండలి వంటి ప్రముఖ సంస్థలూ దీనిలో పాల్గొన్నాయి, చాలామంది ఫిల్ము కళాకారులూ, ప్రముఖ నటులూ యీ ఉత్సవానికి హృదయ పూర్వకంగా సహాయం చేశారు.

సైకిలిస్టుల, ఫుట్‌బాల్ ఆటగాళ్ళ సంఘాలవంటి వివిధ క్రీడా సంస్థలు రెండు రోజులు క్రీడా ప్రదర్శనలను ఏర్పాటు చేయడానికి నిశ్చయించుకున్నాయి. దీనికి మంచి ప్రోత్సాహం వస్తోంది.

వివిధ సంస్కృతీ, కళాసంఘాలూ, యువజన, విద్యార్థి సంఘాలూ ఆసక్తిని చూపుతూ వుండడం వల్ల, బొంబాయినుండి సుమారు 250 మందిగల ప్రతినిధివర్గాన్ని పంపగలమని సన్నాహ సంఘం భావిస్తోంది. మాస్కో యువజనోత్సవానికి తమ తమ దళాలను పంపడానికి చాలా బృందాలూ, క్రీడా సంఘాలూ చాలా ఉత్సాహంతో వున్నాయి; కార్యనిర్వాహక వర్గం ప్రతినిధి వర్గంలో ఎవరెవరుండాలి, ఎంతమంది వుండాలి అన్న విషయాన్ని కొద్ది రోజుల్లో నిర్ణయిస్తుంది.

## ఉత్సవ ప్రత్యేక సంచిక

ప్రపంచ యువజనులంతా దేనినిగురించి ఈ రోజులలో ఆలోచిస్తున్నారు, కల గంటున్నారు? మాస్కోలో జరుగనున్న ఆరవ ప్రపంచ యువజనోత్సవం కాక మరొకటేదై వుంటుంది!

రానున్న 'సోవియట్ భూమి' ఉత్సవ ప్రత్యేక సంచికగా వెలువడుతుంది:

ఈ సంచికలో:

* ఉత్సవ నగరం, మాస్కో.
* దేశ దేశాలలో ఉత్సవ సన్నాహాలు
* అతిధులకు మాస్కోవాసులు యెట్లా స్వాగతం యివ్వబోతున్నారు; ఉత్సవానికి సంబంధించిన యితర మనోహర విషయాలు, చిత్రాలు, లెనిన్ బహుమతి విజేత లియొనిద్ లియొనోవ్‌ను గురించినవ్యాసం, అంతర్జాతీయ సమీక్ష, ప్రశ్నోత్తరాలు మొదలైన శీర్షికలుంటాయి.

*ప్రతులకు: మా స్థానిక విక్రేతలకుగానీ, నేరుగా దిగువ చిరునామాకు గానీ వ్రాయండి:*

THE INFORMATION DEPARTMENT OF THE
EMBASSY OF THEUSSR IN INDIA,
25, BARAKHAMBA ROAD, NEW—DELHI—1

# ఉత్తం బార్వే



వ్లాదిమిర్ కనిన్ పనిలో

నల్ల సముద్ర తీరానగల అద్భుత నగరం ఒడెస్సాకు పత్రికా రచన పనులవల్ల 1956 జులైలో వెళ్ళాను. ఒడెస్సాకు వెళ్ళి దాని ఓడ రేవుకు వెళ్లకుండా వుండడం అసాధ్యం. అంచాత వెచ్చగా వున్న ఒక ఉదయంపూట, రొదగావున్న ఆ రేవుకు బయలుదేరాను. అక్కడ నూనె ఓడలు, ఎక్స్‌ప్రెస్ ఓడలూ, పెద్ద సరుకుల నౌకలూ లంగరు వేసివున్నాయి. ఒక ఓడమీద భారత పతాకం ఎగురుతోంది. అది సరకుల నౌక "జలమంజరి". బొంబాయి — ఒడెస్సా మార్గంలో ప్రయాణం చేసిన మొదటినౌక యిది.

అదేరోజు సాయంత్రం "జలమంజరి"లోని కొందరు అధికారులతోనూ, పనివారితోనూ నాకు పరిచయమయ్యింది. వారిలో నేవిగేటర్ ఉత్తం బార్వే, రెండవ మెకానిక్కు అజుల్ కాస్టెల్లినో, మూడవ మెకానిక్కు జెర్రీ డిసౌజా, రేడియో ఆఫీసరు అరుణ దేశాయి వున్నారు. మేము నౌకాయానం గురించి, నౌకలగురించి, నౌకా వాణిజ్యం గురించీ మాటాడాము. మాగ్నితోగోర్‌స్క్, ద్నిప్రొపెత్రోవ్‌స్క్ నుండి వచ్చిన లోహాన్నీ, యింజన్లనూ, పైపులనూ, స్ట్రక్చరల్ సెక్షన్లనూ "జలమంజరి"లో ఒక పెద్ద క్రేను వేస్తోంది. సరికొత్త లేతులూ, అప్పుడే మాస్కోనుండి వచ్చినవి, నింపడానికి చాలా గంటలు పట్టింది. తక్కిన సరకుల వలెనే యీ లేతులు కూడా యిప్పుడు భిలాయ్‌లో నిర్మింపబడుతున్న ఇనుము ఉక్కుమిల్లుకు పోతున్నాయి. "భారత దేశం, మాస్కో క్రాస్నీ ప్రొలెతెరీ వర్క్సు నుండి"అని పెట్టెలమీద నున్న మాటలను నేను చూసాను.

"ఎక్కువగా సముద్రయానం చేస్తున్నకొద్దీ, మనం యెక్కువగా వ్యాపారం చేయగలుగుతాము, ఒకరినొకరం ఎక్కువ సన్నిహితంగా తెలుసుకోగలుగుతాము"అన్నారు ఉత్తం బార్వే. "ఈ వేళ మేము 'జలమంజరి'లో వేస్తోన్న యీ యంత్రాలనూ, లేత్‌లనూ తయారుచేసినవారిని నాకు చూడాలని వుంది. మేమంతా ఒకే పనిని చేస్తున్నట్టుగా వుంది. ఎక్కడో మాస్కోలో ఒక కార్మికుడు లేత్‌ను అసెంబుల్ చేస్తాడు, మేము దానిని భారత దేశానికి మా ఓడలో తీసుక వెళ్తాము. ఆ లేత్‌ను తయారు చేసిన రష్యన్ కార్మికుణ్ని కలుసుకుని, అతని కుటుంబం గురించీ, అతను జీవించే పద్ధతిని గురించీ తెలుసుకోవాలనుంది. మాస్కోలో నేనాతణ్ని చూడవచ్చును. అతను బొంబాయిలో నన్ను చూడవచ్చును."

నేను బార్వే అడ్రెసు వ్రాసుకున్నాను; నేను మాస్కోకు తిరిగి వెళ్ళాక క్రాస్నీ ప్రొలెతరీ వర్క్సుకు వెళ్ళి, తాను తెలుసుకొనగోరుతూ వున్న రష్యన్ కార్మికుడెక్కడ వున్నాడో తెలుసుకోవడానికి ప్రయత్నిస్తానని అతనికి చెప్పాను.

ఇటీవలెనే క్రాస్నీ ప్రొలెతరీ పరిశ్రమకు వెళ్లాను.

కాని ఉత్తం బార్వేకు కావలసిన మనిషిని కనుక్కోవడం ఎలాగ? తెలనెరసిన చీఫ్ డిజైనర్ గియోర్గీ గనిఛెంకోను సాయపడమని కోరాను. ఆయన ఒక క్షణం కూడా ఆలోచించకుండా లేత్ ఆపరేటర్ వ్లాదిమిర్ కనిన్ వద్దకు పంపించారు.

"ఆ భారతీయ నావికునికి కావలసిన మనిషి కనినే అని గట్టిగా చెప్పగలను"అన్నారాయన.

చివరికి నేను భోజనాల సమయంలో కాంటీన్లో కనిన్‌ను పట్టుకున్నాను. "మిత్రులారా, మిమ్మల్ని ఒకరికొకరిని పరిచయం చేయనివ్వండి. ఆయన భారత నౌక 'జలమంజరి'లో నావిగేటర్ ఉత్తం బార్వే, యీయన మాస్కోలోని క్రాస్నీ ప్రొలెతరి వర్క్సులో లేత్ ఆపరేటర్ వ్లాదిమిర్ కనిన్"అని పరిచయం చేశాను.

"రేడియోల్లో నాకు ఆసక్తి కలిగేసరికి నేను ఏడో తరగతిలో వున్నాను"అన్నారు కనిన్. "అంచేత ఒక రేడియో క్లబ్బులో చేరి, తొందర్లోనే నా మొదటి రేడియో సెట్టును తయారుచేయడం మొదలుపెట్టాను. పాఠశాలలో ఉత్తీర్ణుణ్నయ్యాక ఫాక్టరీలో లేత్‌ను నడపడం నేర్చుకోవాలని నిశ్చయించుకుని, మా నాన్నగారి అడుగుజాడల్లో నడిచాను. కార్మికునిగా నా జీవితం యీ విధంగా మొదలయ్యింది."

పరిశ్రమలో లోహపుపనిలో ఒక ఉత్తమునిగా పరిగణింపబడిన స్తేపన్ స్మిర్నోవ్ క్రింద అప్రెంటిస్‌గా కనిన్ ప్రవేశపెట్టబడ్డాడు. గత యిరవై ఏళ్లలో స్మిర్నోవ్, తనతోడి లేత్ ఆపరేటర్లు పైతర్ సెల్త్‌సోవ్, నికొలాయ్ ఉగొల్కోవ్, గ్రిగొరీ మార్కోవ్ వలెనే, యంత్రాల పవర్ కెపేసిటీని ఎక్కువ చేయడానికి, లోహపు పనిని

# వ్లాదిమిర్ కనిన్

## ఎన్. వార్

వేగంగా నడపడానికీ, వ్యయాన్ని తగ్గించడానికీ ఎన్నో క్రొత్త భావాలను ఆలోచించి, అమలు జరిపారు.

పరిశీలన. సామర్థ్యంగల తన శిష్యునికి స్మిర్నోవ్ పనిచేయడమూ, నేర్చుకోవడమూ, క్రొత్తవాటిని సృష్టిచేయడమూ నేర్పారు. లేత్‌ను తిప్పి పని తనకుతానే కనిన్ చేసేటట్టుగా, ఆయన తొందరలో చేయగలిగారు.

తనపనిని ఎలా నేర్చుకున్నారో యింకా వివరంగా చెప్పమని నేను కనిన్‌ను అడిగాను. దానిని మామూలు విధంగానే, సోవియట్ యువకార్మికులంతా చేసినట్టుగానే నేర్చుకున్నానని ఆయన చెప్పారు. మొదట నాయన ఒక ఐదు మాసాల కోర్సుకు వెళ్లారు. తరవాత స్మిర్నోవ్ క్రింద పనిచేశారు. చివరికి తాను నిజమైన లేత్-ఆపరేటర్ అయ్యేవరకూ ఆయన ఫోర్మెన్ స్త్రెర్కిన్‌నుండి నిత్యం సహాయాన్ని పొందేవారు. క్రొత్తవాటిని కల్పించడానికి ప్రయత్నించడం మొదలు పెట్టారు.

"కల్పించడం వేటిని?" అని నేనడిగాను.

"బార్వేగారు నావికుడైనందున ఆయనకు యిది ఆసక్తిని కలిగించదనుకుంటాను. అయినా చెప్తాను" అన్నారు కనిన్.

ఆయన పనిచేస్తూ, తన జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకునేందుకు ప్రత్యేక విద్యాలయాల్లో చదువుకుంటూ, లేత్‌లగురించి సాధ్యపడిన దాని నంతట్నీ తెలుసుకుంటూ, లేత్ ఆపరేటర్ పనిలో ప్రమాదాన్ని తగ్గించడం ఎలాగా అని ఆయన ఎప్పుడూ ఆలోచిస్తూ వుండేవారు. (క్రొత్తవాటిని కల్పించడంలో ఆయనకు మంచి ప్రతిభావుంది. ఆయన తానే యింట్లో టెలివిజన్ సెట్టును తయారుచేసి, తల్లికి బహూకరించారు). సోవియట్ కార్మికులు సాధారణంగా చేసేటట్టుగా ఎక్కువ వేగాలలో లేత్‌ను నడిపేటప్పుడు, వాడిఅయిన వేడిముక్కలు ఎగురుతాయని ప్రతి ఆపరేటరుకూ తెలుసు. అవి ఆపరేటర్ చేతులమీదా, మెడమీదా, ముఖంమీద సైతం పడవచ్చును.

లేత్‌కు రక్షణను తయారు చేయడ మెలాగావని కనిన్ చాలా కాలం ఆలోచించాడు. ఒక ముక్క యెగిరివచ్చి తన స్నేహితుడు గెన్నదీ కొకశేవ్ మెడకోసిన సందర్భంలో, ఎంత పెద్ద రక్షణ అవసరమవుతుందో ఆయనకు బాగా తెలిసింది. అదే రోజున కనిన్, పైతొర్ గుబరెంకో అన్న ఇంజినీరయిన షాపు సూపరెండెంటుతో సంప్రదించి, రక్షణకు డిజైన్ చేయడానికి పూనుకున్నారు. అది కష్టంగా తోచలేదు. ఆపరేటరు చూడడానికి వీలు కలిగించే వస్తువుతో రక్షణను తయారు చేయాలి; ముక్కలు రక్షణకు కొట్టుకుని, ఒక ప్రక్కకు పడిపోయేటట్టుగా వుండాలి. కాని కనిన్ తన టర్నర్ మిత్రులపనిని నెలల తరబడిగా గమనించి, కొన్ని డజన్ల రక్షణలను డిజైన్ చేశారు. ఒకటిన్నర ఏళ్ళ పాటాయన అన్వేషించారు, గమనించారు, ప్రయోగాలు చేశారు, డ్రాయింగులు వేశారు; చివరికి సులభమైన, సదుపాయమైన రక్షణను తయారు చేశారు. దీనిని ప్రవీణుల సంఘమూ, మంత్రివర్గపు సాంకేతిక సమితి ఆమోదించాయి. పరిశ్రమలోని క్రొత్త లేత్ లన్నింటికీ ఇప్పుడివి అమర్చబడి వున్నాయి.

"పారదర్శకమైనదీ, గట్టిదీ అయిన ఈ రక్షణ టర్నర్ పనిని సురక్షితం గావిస్తుంది. అతివాడియైన ముక్కల గురించి యిక అతడు భయపడవక్కరలేదు" అన్నారు కనిన్, నన్ను షాపులోనికి తీసుకవెళ్తూ. అక్కడ కనిన్ తయారుచేసిన రక్షణతోవున్న సరికొత్త ఆటోమేటిక్ లేత్‌లు మృదువుగా కన్వేయర్‌మీద పనిచేస్తున్నాయి.

"కనిన్, యిప్పుడు మీరు ఏం చేస్తున్నారు?" అంటూ నేను ఆయనను అడిగాను.

"మన భారతీయ నావిక మిత్రునికి యిది ఆసక్తి కలిగిస్తుందా?" అని అడిగారు కనిన్ చిరునవ్వుతూ. "అయినట్టయితే మన భారతీయ మిత్రులకు చెప్తాను. మా ఫోర్మెన్ స్త్రెర్కిన్, ఇంజినీరు షఖోవ్‌స్కీతో బాటుగా నేను ఒక హైడ్రాలిక్ టర్బయిన్‌గల లేత్ సమస్య గురించి కృషి చేస్తున్నాను."

"అంటే అర్థం?"

"లేత్‌కు, గేర్‌బాక్స్ హృదయమని ప్రతి టర్నర్‌కూ తెలుసును. దానిలోని పలు భాగాలలో ఒకటి పనిచేయక పోయినట్టయితే, లేత్ నడవడం మానేస్తుంది. గియర్ బాక్స్‌లో ఏదోలోపం వుండడం వల్లనే, ఎక్కువగా పని ఆపుదలలు సంభవిస్తున్నవని సంఖ్యా వివరణలు తెలియజేస్తున్నాయి. అందుచేత గియర్ బాక్స్‌కు బదులుగా టర్బయిన్‌ను పెట్టడం ఎలాగా అన్న విషయం గురించి మేము కృషి చేస్తున్నాము. ప్రస్తుతం మేము దొరికినదల్లా చదువుతున్నాము, డిజైనర్లను సంప్రదిస్తున్నాము, సాంకేతిక ప్రదర్శనలకు వెళ్తున్నాము."

వ్లాదిమిర్ కనిన్ గురించి, ఆయన పనిని గురించి నేను చెప్పగలిగిన దానితో బహుశా నావిగేటర్ ఉత్తం బార్వే సంతృప్తి చెంది వుండవచ్చును, కాని సర్వమూ పనేకాదు. వ్లాదిమిర్ కనిన్ భావంకూడా అదే.

"బహుశా అందుకేనేమో నా 23 ఏళ్ళ వయస్సులో నేను పెళ్ళి చేసుకున్నాను" అన్నారాయన చిరునవ్వుతో. "నా భార్య తమారా కూడా ఫాక్టరీ కార్మికురాలే. సాయంత్రం కళాశాలకుకూడా ఆమె వెళ్తోంది. ఆర్థిక శాఖలో యిప్పుడామె మూడో సంవత్సరం తరగతిలో వుంది. ఇందువల్ల నామె తన భర్తకంటె ఒక అడుగు ముందుగా వుంది. నేను యంత్రపరికరాల సాయంత్రం విద్యాశాలలో ఈ ఏడాది మాత్రమే ప్రవేశిస్తున్నాను."

"పనితోబాటు చదువు కాస్త కష్టంగా లేదూ?"

"అవును, ముఖ్యంగా చిన్నకూతురు వున్నప్పుడు. ఈ

(మిగత 28వ పుటలో)



# ప్రశ్నలకు గ్రోమికో జవాబులు

సుప్రీం సోవియట్ సమావేశం ముగియడానికి ముందర సోవియట్ దేశ విదేశాంగ మంత్రి ఏ. గ్రోమికో, కొంతమంది సభ్యులు పరమాణు, ఉదజని ఆయుధాల పాటవపరీక్షల నిషేధం విషయమై అడిగిన ప్రశ్నకు ప్రభుత్వం తరఫున సమాధానం యిచ్చారు.

ఇప్పుడు లండన్‌లో జరుగుతోన్న నిరాయుధీకరణ సంభాషణల సంభవనీయమైన ఫలితం గురించి, కచ్చితమైన అభిప్రాయానికి రావడానికి సమయమాసన్నం కాలేదని గ్రోమికో తెలియజేశారు. గతంలో పలుసార్లు యిప్పటికే జరిగినట్టుగా పునరావృతం కావడానికే యివి జరుగుతున్నవా—గతంలో పశ్చిమ రాజ్యాలు తమ ప్రతిపాదనలపైనే ఏదో ఒక విషయం గురించి తమకూ, సోవియట్ దేశానికీ మధ్య అభిప్రాయాలు సన్నిహితమైన వెంటనే పలుసాకులతో వెనుకకు మళ్లేవి—, లేదా పశ్చిమ రాజ్యాలు నిజంగా మనఃపూర్వకమైన సంభాషణలకూ, ఒడంబడికకూ సిద్ధంగా వున్నవా అన్నది సమీప భవిష్యత్తులో విదితమవుతుంది.

"నిరాయుధీకరణ సమస్యపట్ల, న్యూక్లియర్ ఆయుధాల పాటవపరీక్షలను అంతం చేయడంతో బాటుగా పరమాణు, ఉదజని ఆయుధ సమస్య పరిష్కారం పట్ల ముఖ్యంగా, స్థిర చిత్తతతో కూడిన దృక్పథమే జయించాలని మనం ఆశిద్దాం" అన్నారు గ్రోమికో.

## సోవియట్ దేశం న్యూక్లియర్ ఆయుధాలను ఎందుకు తయారు చేయవలసి వచ్చింది?

సోవియట్ దేశం తన సాయుధ సేనలలో ఏకపక్షంగా పెద్ద తగ్గింపును చేసినప్పటికీ— యిది బాగా తెలిసిన విషయమే—, పరమాణు, ఉదజని ఆయుధాల సమస్య విషయమైగాని, సాయుధ సేనల తగ్గింపు విషయమైగాని దేశాల మధ్య ఒడంబడిక యింకా జరగలేదన్న యదార్థ స్థితి ననుసరించి, ప్రస్తుతం సోవియట్ దేశం ప్రవర్తించవలసి వస్తోందని గ్రోమికో తెలియజేశారు. స్వీయ భద్రతా ప్రయోజనాల దృష్ట్యా, యావత్తు సోషలిస్టు శిబిరం ప్రయోజనం దృష్ట్యా, ప్రపంచం అంతటా శాంతి పరిరక్షణ ప్రయోజనాల దృష్ట్యా, సోవియట్ దేశం న్యూక్లియర్ ఆయుధాల, యింతేకాకుండా కొత్తరకాల పరమాణు, ఉదజని బాంబుల, కొత్తరకాల గైడెడ్ మిస్సైల్స్ ఉత్పత్తిని సాగించవలసి వచ్చింది. యీ విధంగా తన ఆత్మరక్షణ శక్తిని అన్ని విధాలా దిట్టపర్చుకోవలసి వస్తోంది. సోవియట్ దేశం పరమాణు, ఉదజని ఆయుధాల పాటవ పరీక్షలను చేసింది. యిటువంటి పరీక్షలను అమెరికా, గ్రేట్ బ్రిటన్ కూడా చేస్తూ వుండడంవల్ల.

"సోవియట్ దేశం ఒక్కటే పరమాణు, ఉదజని ఆయుధాల పాటవ పరీక్షలను ఆపివేసినట్టయితే, అమెరికా, బ్రిటన్ ప్రభుత్వాలకు అభ్యంతర మేమీ ఉండదని చెప్పనక్కరలేదు" అంటూ గ్రోమికో సాగించారు. కాని సహజంగా దీనిని చేయడం సాధ్యపడదు. యిది సోవియట్ దేశాన్ని అననుకూల పరిస్థితిలో పెడుతూ, దానిని క్రిందిచేయిగా చేస్తుంది గాబట్టి. అది సోవియట్ దేశ భద్రతకు ప్రమాదాన్ని వాటిల్ల జేస్తుంది, పశ్చిమ రాజ్యాల యుద్ధ సన్నాహాలు యెక్కువ కావడానికూడా దారితీస్తుంది. యీ విధంగా పరమాణు యుద్ధ ప్రమాదాన్ని పెంచివేస్తుంది. ఇందువల్ల, ఒక్క సోవియట్ దేశమే పరమాణు, ఉదజని ఆయుధ పాటవ పరీక్షలను ఆపివెయ్యాలని కోరేవారు, అతిగా కోరుతున్న వారవుతారని చెప్పవలసి వస్తుంది.

"సామెతలో వున్నట్టుగా మాకు 'సబబు' కావాలి. మీరుకూడా ఆపివేసినట్టయితే, మేము పరమాణు, ఉదజని బాంబులను పేల్చడం మానివేస్తాము. మీరు ఇటువంటి పరీక్షలను సాగించినట్టయితే, మేము కూడా సాగిస్తాము. పరమాణు, న్యూక్లియర్ పాటవ పరీక్షల నిలుపుదలతో యితరదేశాలు సోవియట్ దేశం అంతగానూ ఆసక్తిని తీసుకోవాలి."

న్యూక్లియర్ ఆయుధాలను నిషేధించాలనీ, వెంటనే పాటవ పరీక్షలను ఆపివేయాలనీ చేయబడిన సోవియట్ ప్రతిపాదనలను వ్యతిరేకించేవారు చేసే వాదనలలో పసలేదని తెలియజేసి, గ్రోమికో యీ విధంగా చెప్పి ముగించారు:

"సోవియట్ ప్రభుత్వం పరమాణు, ఉదజని ఆయుధ పాటవ పరీక్షల నిలుపుదల సమస్యా పరిష్కారానికి గొప్ప ప్రాధాన్యాన్నిస్తోంది. అమెరికా బ్రిటన్ ప్రభుత్వాలు తమ దృక్పథాన్ని మార్చుకుని, యీ విషయమై ఒక ఒడంబడికకు రాగలవని ఆశిస్తోంది.

"న్యూక్లియర్ ఆయుధాల నిషేధం కోసమూ, యీ సమస్యా పరిష్కారాన్ని సులభతరం చేసే ఏ చర్యలకోసమైనా సోవియట్ దేశం ఏకరీతిగా పోరాటాన్ని సాగిస్తుంది. సోవియట్ ప్రభుత్వం యొక్క యీ దృక్పథం, అంతర్జాతీయ ఉద్రిక్తతను తగ్గించడమూ, అమితాయుధోత్పత్తి పోటీని నిలిపివెయ్యడమూ, దేశాల మధ్య శాంతిని దృఢపరచడమూ ఉద్దేశంగా గల సోవియట్ దేశపు మార్పులేని, ఏకరీతిగా వున్న విధానాన్ని వ్యక్తపరుస్తుంది."

* * *

సోవియట్ దేశ సుప్రీం సోవియట్, పరమాణు, ఉదజని ఆయుధాల పాటవపరీక్షలను వెంటనే, మొత్తంగా ఆపివెయ్యడానికి సంబంధించిన సమస్య విషయంలో సోవియట్ ప్రభుత్వవిధానాన్నీ, ఆచరణ యోగ్యమైన చర్యలనూ ఆమోదించింది.

# అమెరికన్ కాంగ్రెసుకు, గ్రేట్ బ్రిటన్ పార్లమెంటుకూ సోవియట్ దేశ సుప్రీం సోవియట్ విజ్ఞప్తి

—మాస్కో. 11-5-57 (టాస్)

సోవియట్ సామ్యవాద రిపబ్లిక్కుల సమాఖ్య సుప్రీం సోవియట్ అమెరికన్ కాంగ్రెస్‌కూ, గ్రేట్ బ్రిటన్ పార్లమెంటుకూ యీ లేఖను పంపుతూ అవి దీనివి అర్థం చేసుకుని అనుకూలంగా జవాబిస్తాయని విశ్వసిస్తూంది.

ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితివల్ల, ప్రపంచ శాంతి భవిష్యత్తు పట్లనూ, మానవజాతిని భయపెడుతున్న ప్రమాదాన్ని నిరోధించడం విషయంలోనూ తమ బాధ్యతావగాహనను ప్రదర్శించడం మన మూడురాజ్యాల పార్లమెంటుల కర్తవ్యమవుతూందని సోవియట్ సామ్యవాద రిపబ్లిక్కుల సమాఖ్య సుప్రీం సోవియట్ విశ్వసిస్తూంది.

అమెరికా, గ్రేట్ బ్రిటన్ ప్రజలవలెనే, సమస్త ప్రపంచంలోని లక్షలాది స్త్రీ పురుషులవలెనే సోవియట్ ప్రజలు, ఆయుధ పోటీ ఎలా అత్యంత ప్రమాదకర దశలోకి వెళ్తూందో నానాటికీ అత్యధిక ఆందోళనతో గమనిస్తున్నారు.

విపరీతమైన వినాశకశక్తి గలిగిన కొత్త రకాల ఆయుధాల—అణు, ఉదజని బాంబులు, అంతర్ ఖండ రాకెట్లు, ప్రజలను మూకవుమ్మడిగ నాశనం చేసే తదితర సాధనాలు—ఉత్పత్తి క్రమక్రమంగా యెక్కువవుతూంది, యీ ఆయుధాల నిలవలు పెరుగుతున్నాయి.

అణు, హైడ్రోజన్ ఆయుధాల ప్రయోగంతో కూడిన యెలాంటి యుద్ధమైనా లక్షలాది ప్రజలను హతమార్చి, మొత్తం దేశాలనూ, అపూర్వమైన మహత్తర సాంస్కృతిక విలువలనూ నాశనం చేసే ప్రమాదంతో భయపెడుతున్న కాలంలో మానవజాతి జీవిస్తూంది.

ఈనాడు ప్రపంచ ప్రజాభిప్రాయం, అణ్వాయుధ పాటవ పరీక్షల మూలంగా ఏర్పడే ప్రమాదంవల్ల న్యాయంగా అత్యంత ఆందోళనా భరితమై వున్నది.

అటువంటి పరీక్షలవల్ల కలిగే పరిణామాల గురించి యింకా సరియైన పరిశీలన జరగకపోయినప్పటికీ, ప్రపంచంలోని ప్రముఖ శాస్త్రజ్ఞులు, అటువంటి పాటవపరీక్షలు ప్రజల ఆరోగ్యానికి ప్రమాదకరమని యిప్పటికే హెచ్చరిస్తున్నారు.

ఆయుధపోటీ రాజ్యాలమధ్య సంబంధాలలో అవిశ్వాసానికీ అనుమానానికి తావిస్తూ, అందుమూలంగా అంతర్జాతీయ వాతావరణాన్ని కలుషితం చేస్తూంది. అది భయాన్నీ, సందిగ్ధతనూ కలిగిస్తుంది: అది ప్రజలను శాంతియుతంగా జీవించనివ్వదు, పనిచేయనివ్వదు. ప్రపంచమంతటా తల్లులు తమ బిడ్డల భవిష్యత్తును గూర్చి, యువకులు తమ భవిష్యత్తును గూర్చి ఆందోళన చెందుతున్నారు. బాగా డబ్బు కర్చుతోకూడిన అణు, ఉదజని బాంబుల ఉత్పత్తి, ఆయుధాలకోసం తమ బడ్జట్ల నుండి నానాటికీ అధికంగా డబ్బు చెల్లించవలసి వస్తున్న, పన్నులు కట్టే ప్రజలపై పెద్ద భారమవుతూంది.

ప్రపంచమంతటా జనాభాలోని వివిధవర్గాలవారు అణ్వాయుధపోటీకి స్వస్తి జరగాలనీ, మానవజాతికి రానున్న విపత్తు తొలగింపబడాలనీ పట్టుదలగా డిమాండ్ చేస్తున్నారు.

దురదృష్టవశాత్తూ, అణుయుద్ధం అనివార్యమనీ, అణ్వాయుధపోటీ ఆపివేయబడజాలదనీ ప్రజలకు నమ్మకం కలిగించడానికి ప్రయత్నిస్తున్న రాజకీయ, సైనిక వర్గాలు యింకా కొన్ని వున్నాయి. అయితే యీ విధమయిన వాదన మోసంతోకూడినది; ప్రపంచ శాంతిని రక్షించడాలికీ, బలపరచడానికీ ప్రజల దీక్షను భగ్నం చేయడానికీ అది ఉద్దేశించబడింది. అణుయుద్ధాన్ని తొలగించవచ్చును, తొలగించి తీరాలి. తమ దేశాల విధానంపై ప్రభావం చూపి పార్లమెంటులు యీ ఆశయానికి గొప్ప సేవ చేయగలవు.

అణు ఉదజని ఆయుధాలను కలిగివున్న అమెరికా, గ్రేట్ బ్రిటన్, సోవియట్ దేశాలలోని బాధ్యతాయుత వర్గాలపై ప్రజలు న్యాయముగా ప్రత్యేకమైన ఆశలు పెట్టుకున్నారు. ఈనాడు, అణుయుగ ప్రారంభదశలో, మూడు రాజ్యాలు మాత్రమే అణ్వాయుధాలను ఉత్పత్తి చేస్తున్నప్పుడు, అణుయుద్ధాన్ని అరికట్టడానికి చర్యల గురించి ఒక ఒప్పందానికి రావడం కొంతవరకు సులభమే. నిరాయుధీకరణ సమస్యా పరిష్కారంలో మిత్రరాజ్యసమితి తన పాత్రను నిర్వహిస్తుందని ప్రపంచ ప్రజలు ఆశిస్తున్నారు.

సోవియట్ సామ్యవాద రిపబ్లిక్కుల సమాఖ్య సుప్రీం సోవియట్ యిదివరకే, 1956 జులై 16వ తేదీన చేయబడిన తన విజ్ఞప్తిలో, నిరాయుధీకరణ సమస్యనూ, అణు, ఉదజని ఆయుధాలను నిషేధించడం విషయాన్నీ సకల దేశాల పార్లమెంటుల దృష్టికి తీసుకువచ్చింది.

మొత్తం నిరాయుధీకరణ సమస్యా పరిష్కారాన్ని సులభతరం చేసే వాంఛతో సోవియట్ ప్రభుత్వం, అణు, ఉదజని ఆయుధాల సమస్యపై ఒక జనరల్ ఒడంబడిక జరిగిందా లేదా అనే ప్రసక్తే లేకుండా, అణు, ఉదజని బాంబుల పాటవ పరీక్షలను వెంటనే ఆపివేయడానికి తన సంసిద్ధతను ప్రకటించిందన్నది తెలిసిన సంగతే.

సోవియట్ దేశ సుప్రీం సోవియట్, సోవియట్ ప్రభుత్వంయొక్క యీచర్యను పూర్తిగా ఆమోదిస్తూ, అణు ఉదజని బాంబుల పాటవ పరీక్షలను వెంటనే ఆపివేయడం గురించి సోవియట్ యూనియన్, అమెరికా, గ్రేట్ బ్రిటన్ ప్రభుత్వాలు ఒక ఒప్పందానికి రావడానికి తోడ్పడాలనీ, యీ లక్ష్య సాధనకై అవి అవసరమని భావించే చర్యలు తీసుకోవాలనీ అమెరికన్ కాంగ్రెస్‌కూ, గ్రేట్ బ్రిటన్ పార్లమెంటుకూ విజ్ఞప్తి చేస్తూంది.

సోవియట్ దేశ సుప్రీం సోవియట్ తనవంతుకు, అణు, ఉదజని ఆయుధ పాటవ పరీక్షల ఆపివేతకూ, అటువంటి ఆయుధాల నిషేధానికీ దారితీసే మార్గాలను గురించి ఒకరి అభిప్రాయాల నొకరికి తెలుపుకునేందుకు అమెరికా, గ్రేట్ బ్రిటన్, సోవియట్ యూనియన్‌ల అంతర్ పార్లమెంటరీ కమిటీ నొకదానిని స్థాపించే విషయాన్ని అమెరికన్ కాంగ్రెస్, గ్రేట్ బ్రిటన్ పార్లమెంటుల ముందుంచుతూంది.

అమెరికన్ కాంగ్రెసూ, గ్రేట్ బ్రిటన్ పార్లమెంటూ ప్రజల వాంఛ కనుగుణంగా, యీ సమస్యా పరిష్కారానికి తోడ్పడడానికీ, దానిని ఆలస్యం జరగకుండా పరిష్కరించడానికీ తమ శాయశక్తులా పాటుబడతాయని సోవియట్ దేశ సుప్రీం సోవియట్ ఆశిస్తూంది.

# కుపవ్నా బట్టల మిల్లు, దాని "ఉపగ్రహాలు"



క్రుపవ్నా మేలురకం బట్టల మిల్లుగల చిన్న కార్మిక నగరానికి వచ్చి నేను వీధుల్లో నడుస్తున్నాను.

"ఇది ఎవరి శిశుపోషణాలయం? ఈ క్లబ్బు ఎవరిది? ఈ కళాశాల ఎవరిది?" అంటూ త్రోవను పోయే వాళ్ళను అడుగుతున్నాను. "శిశుపోషణాలయం ఫ్యాక్టరీది. మా కుపవ్నా మిల్లుది క్లబ్బు. కళాశాలకూడా మిల్లుదే." అంటూ జబాబు చెప్పారు, నేను వీధిలో అడిగిన వాళ్లు.

నిజానికి యిందులో అసాధారణమైన దేదీ లేదు. సూర్యుని చుట్టూరా గ్రహాలున్నట్టుగా,

## ఐ. పోల్యానిన్





పరిశ్రమ చుట్టూ యీ "ఉపగ్రహా" లుండడం సోవియట్ దేశంలో పరిపాటి అయిపోయింది.

కుపవ్నా మేలు రకం బట్టలమిల్లు గురించీ, దాని "ఉపగ్రహాల" గురించీ, యీ వ్యాసంలో మీకు తెలియజేస్తాను.

ఈ మిల్లు పెద్దదేమీకాదు. కాని రష్యాలో సామెతొకటి వుంది, "చిన్న శరీరాల్లో గొప్ప ఆత్మ లుండొచ్చు"నని. నిజమే, కుపవ్నా మిల్లు చిన్నది. కాని దానిపేరు దేశం అంతటా వ్యాపించింది. అంతేకాకుండా, అది ఖ్యాతిని పొందడం రెండు వందల ఏళ్ళకు పైనుండీ వుండడంవల్ల కాదు, దేశంలో తయారయ్యే మేలురకాల బట్టల్లో శ్రేష్ఠమైన వాటిని అది తయారు చెయ్యడంవల్లనూ కాదు. ఇద్దరు బాలికలు దానిని సుప్రఖ్యాతం చేశారు. వాళ్లు వడుకు పనికత్తె మారియా రొజ్నోవా, నేత పనికత్తె, లిదియా కొనొనెంకో. ఎనిమిదేళ్ల క్రితం, 1949 లో, యీ యిద్దరూ ఒక ముఖ్యమైన సూచనను చేశారు — ఉత్పత్తిలోని ప్రతి స్థాయిలోనూ ఉన్ని దుర్వ్యయాన్ని సాధ్యమైనంత యెక్కువగా తగ్గించడానికి ఒక అనుకరణోద్యమాన్ని ప్రారంభించమని.

తయారయిన వస్తువుల ఖరీదులో ముడి పదార్థాలు పదింటి తొమ్మిది వంతులుగా వుండే





ఛాయా చిత్రకారుడు: ఛాప్రునోవ్
















శీతకాలంలో కుపవ్నా మిల్లుకార్మికుల
నివాస దృశ్యం



వస్త్ర పరిశ్రమకు యీ సూచన యెంత ముఖ్యమైనదో ఎవరైనా సులువుగా ఊహించవచ్చును. రొజ్నేవా, కొనొనెంకో చేసిన సూచనలను బలపర్చి యీ చిన్న మిల్లు కార్మికులు, ఒక్క ఏడాదిలోనే యెన్నో టన్నుల ఉన్నిని దుర్వ్యయము కాకుండా చేశారు. అంతేకాకుండా యీ దుర్వ్యయం కాని ఉన్నితో శ్రేష్ఠమైన నాణ్యం గల 163,000 మీటర్ల మేలురకం బట్ట తయారయింది. ఇది యూరోపియన్ పద్ధతిలో 50 వేలమంది పురుషుల సూట్లను తయారు చేయడానికి చాలును.



మారియా రొజ్నేవా, వడకు విభాగపు అసిస్టెంటు ఫోర్మన్ (ఎడమను), స్పిన్నర్ క్లావ్దియా స్మొరొదినా, లిదియా యుఖ్వొస్తోవాలతో సంభాషిస్తూ

## మిల్లు పనికత్తె సుప్రీం సోవియట్‌కు ఎన్నిక

రొజ్నేవా, కొనొనెంకో సూచించిన పని పద్ధతిని బట్టల కార్మికులే కాకుండా, యింకా అనేక యితర పరిశ్రమలలో ఇనుము ఉక్కు కార్మికులు, యంత్ర పరికరాల నిర్మాతలు, కర్ర పనివారు, జోళ్ళ పనివారూ కూడా చెపట్టేరు—ప్రతిపని క్రమంలోనూ వీరందరూ ముడి పదార్థాలు దుర్వ్యయం కాకుండా ఆపడం మొదలు పెట్టారు.



కుపవ్నా మిల్లుకు వచ్చినట్టయితే, దేశం అంతటా ప్రఖ్యాతిగాంచిన మారియా రొజ్నేవా—యిప్పుడామె అసిస్టెంట్ ఫొర్మేన్—పనిచేస్తోన్న షాపుకు వెళ్దామని మీరు సహజంగా అనుకుంటారు. ఆమె స్నేహితురాలు లిదియా కొనొనెంకో ఇప్పుడు మాస్కో వస్త్రవిద్యాశాలలో విద్యార్థిని.

ఈ ఎనిమిదేళ్ళలో మారియా రొజ్నేవా రాజకీయ విశారదురాలుగా తయారయ్యింది. తన రిపబ్లిక్కు సుప్రీం సోవియట్‌కు సభ్యురాలయ్యింది. సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ పందొమ్మిదవ, యిరవైయ్యవ మహాసభలకు ప్రతినిధిగా వెళ్ళింది. ఆమె వయస్సు 27 ఏళ్ళు మాత్రమేనని జ్ఞాపకం పెట్టుకోండి.

మా భారతీయ పాఠకులకు కుపవ్నాగురించి చెపుదామనుకుంటున్నానని నేనామెతో అన్నాను.

"ఒక విధంగా చూస్తే, కుపవ్నా గురించి భారత దేశంలో యిప్పటికే తెలుసును" అంది రొజ్నేవా. "భారత దేశపు పార్లమెంటు సభ్యురాలు ఆనీ మాస్కరేన్, భారతీయ మహిళా జాతీయ సమాఖ్య ప్రధాన కార్యదర్శిని హజ్రా బీగం నాయకత్వాన ఒకసారిక్కడికి భారతీయ మహిళల ప్రతినిధివర్గం ఒకటి వచ్చింది. భారతీయ మహిళలు బాలోద్యానవనానికి వచ్చినప్పుడు పిల్లలు వారిచుట్టూరా గుమిగూడి పూలు బహూకరించారు. అతిథులు పిల్లలను మాతృవాత్సల్యంతో ఎత్తుకున్నారు. వారి కళ్ళు చెమ్మగిల్లాయి. మాకుకూడాకళ్లు చెమ్మగిల్లాయి.

"మా షాపుకు వచ్చివెళ్ళిన భారతీయ మహిళలు యిప్పుడిక్కడికి వచ్చినట్టయితే, యిక్కడ చాలా వాటిని పోల్చుకోలేరు. ఉదాహరణకు నూలువడికే షాపులో యీ రెండేళ్ళలో ప్రతి ఒక్క పాతయంత్రం స్థానంలో కొత్తవి వచ్చాయి. పూర్వం యిక్కడ చాలా పాతకాలపు స్వయంచోదకమైన మ్యూల్సు ఉండేవి. ఇప్పుడు అతి నవీనమైన నూలు వడుకు యంత్రాలున్నాయి."

### "ఉపగ్రహాలు"

కుపవ్నా మిల్లుకు చదరంగా నాలుగు చిన్న కట్టడాలు మాత్రమే ఉన్నాయి. కుపవ్నా నగరం కూడా చిన్నదే. ఈ పత్రిక ఛాయా చిత్రగ్రాహకుడు చేసినట్టుగా జలాశ్రయం శిఖరంమీదికి నిచ్చెనమీదుగా మీరు వెళ్ళినట్టయితే, యావత్తు నగరమూ, మిల్లూ, దానికి చుట్టూ గుమిగూడివున్న "ఉపగ్రహాలూ" పిట్టచూపుగా కనిపిస్తాయి.

కుపావ్నాలో ఏముంది ? పనిలో లేనప్పుడు కార్మికుడు ఎలా కాలక్షేపం చేస్తాడు ?

ప్రప్రధానంగా అతను చదువుకుంటాడు. ఇప్పుడు మిల్లులో మూడు వేలమందికి కాస్త పైగా పనిచేస్తున్నారు, వారిలో 1,719 మంది చదువుకుంటున్నారు.

కుపవ్నాలో ఎక్కువగావున్నవి చిన్నయిళ్ళు, ముఖ్యంగా ఒకేఅంతస్తుయిళ్ళు. మీరు వీధిలో నడుస్తున్నట్టయితే, తెల్లని-యిటుకతో కట్టిన నాలుగంతస్తుల యింటిని, యిందువల్ల మీరు గమనించకుండా ఉండలేరు.

"ఇదికూడా మీదేనా ?" అని నాతో వున్నాయనను అడిగాను.

"అవును మాదే. మా సాయంత్రం పాఠశాల విద్యార్థుల కిక్కడ పాఠాలుజరుగుతాయి" అని ఆయన చెప్పాడు. కొద్దిదూరంలో ఒక చిన్న రెండంతస్తుల యిటుకల, యింటిని

కుపవ్నా మిల్లు వడకు విభాగం



చూశాను. ఇదికూడా మా 'ఉపగ్రహా'లలో ఒకటనీ, అది కుపవ్నా సాయంకాల వస్త్ర పరిశ్రమ సెకండరీ పాఠశాల అనీ సగర్వంగా అయన చెప్పాడు.

ఇక్కడ ఒక కార్మికుడు సెకండరీ విద్యను పూర్తిచేసుకొవచ్చును. సారస్వతం, భూగోళ శాస్త్రం. చరిత్ర, పదార్థ విజ్ఞానశాస్త్రం, రసాయనికశాస్త్రం, గణితశాస్త్రం చదువుకోవచ్చును. ఇంతేకాకుండా యిక్కడ వస్త్ర పరిశ్రమ సిద్ధాంత పరిజ్ఞానంలో పాండిత్యాన్ని సంపాదించవచ్చును. ఈ కళాశాల పేరుకు "సాయంత్రం" అని చేర్చడానికి కారణం, మిల్లులో తమ పని తరవాత కార్మికులు సాయంకాలాలు యిక్కడికి రావడమే. విద్యార్థుల సంఖ్య 183. ప్రతి ఏడాదీ కళాశాలలో 40 మంది ప్రవీణులు పట్టభద్రులవుతారు. మారియా రొజ్నోవా ఒక





కొస్తోచ్కిన్ కుటుంబపు శిశువు షురా పట్ల శిశుపోషణాలయు దాది శ్రద్ధ వహిస్తున్నది



కుపవ్నా మిల్లు బాలోద్యానవన ప్రాంగణంలో గాల్యా, ఒలోద్యా కొస్తోచ్కిన్



గౌరవ యోగ్యతాపత్రంతో యిక్కడ పట్టభద్రురాలయింది. ఒకప్పుడు సామాన్య పనికత్తె అయిన యీమె సాంకేతిక నిపుణురాలూ, అసిస్టెంటు ఫోర్మన్ అవడానికి యిదామెకు తోడ్పడింది.

మాస్కో వస్త్ర విద్యాలయం శాఖ కూడా యీ మిల్లులో వుంది. నేను మిల్లును చూస్తుండగా, ప్రిపరేటరీ షాపు ప్రధానోద్యోగి మిహెయిల్ కొరాత్కోవ్‌తో సంభాషించడం జరిగింది. కొరత్కోవ్ ఒక పాత బట్టల కార్మికుడు. కుపవ్నాలో జన్మించిన వ్యక్తి. ఆయన తలిదండ్రులు యావజ్జీవితమూ మిల్లులో పని చేశారు. ఇప్పుడు వారు పింఛనీ పుచ్చుకుంటున్నారు. కొరత్కోవ్ మిల్లులో పనికి కుదిరినప్పుడాయన సప్తవర్ష పాఠశాలలో మాత్రమే ప్యాసయ్యారు. సోవియట్ దేశంలో సెకండరీ పాఠశాల చదువు పదేళ్లు. ఆయన ఫిట్టర్ అప్రెంటిస్‌గా పనిని మొదలుపెట్టారు. ఆయన చదవాలని నిశ్చయించుకుని సాయంత్రం కళాశాలలో ప్రవేశించారు. సప్తవర్ష విద్య వున్నట్టయితే కార్మికులు యీకళాశాలలో ప్రవేశ పెట్టుకోబడతారు. ఈ చదువు ఫలితంగా ఆయనసాంకేతిక నిపుణుడయ్యారు, తరవాత నేత షాపుకు అసిస్టెంట్ ఫోర్మన్ అయ్యారు.

ఒకసారి ఆ మిల్లు డైరెక్టరు ఆయనతో యిలా అన్నాడు: "చూడు, మిహెయిల్, విద్యాశాలలో చేరకూడదూ? అభివృద్ధి అవ్వాలి గదా ఎవరైనా". మిల్లులో నడిపేందుకు ఆ ఏడాది స్థాపింపబడిన వస్త్ర విద్యాశాల శాఖకు కొరత్కోవ్ దరఖాస్తు పెట్టాడు. కొరత్కోవ్ చదువులో ముందుకు పోతూవుంటే ఆయనకు షిఫ్టుఫోర్మన్ పనికి ప్రమోషన్ వచ్చింది, తరవాత ఒక శాఖకు ఆయన ప్రధానోద్యోగిగా నియమింపబడ్డారు. ఇప్పుడు ఆరో సంవత్సరం చదువుతూ పట్టంకోసం ఆయన రచనను తయారు చేస్తున్నారు. పరిపాటిగా అనే టట్టుగా యింజినీరు కావడానికి యింకా ఒక్క మెట్టుంది.

## అంతా విద్యార్థులే

"పాఠశాలలో యిప్పటికే యిరవై ఏళ్ళు విద్యార్థిగా వుండి, తరవాత కళాశాలలోనూ, ఇప్పుడు విద్యాశాలలోనూ వుంటున్నందుకు ఇంట్లో ఏమీ అనడంలేదూ?" అని నేను కొరత్కోవ్‌ను అడిగాను.



రష్యన్ సమూత్య విశిష్ట ఉపాధ్యాయిని ఎస్. ద్యకానోవా, కొన్స్టోచ్కిన్ పిల్లలు-యూరీ, ల్యుడ్మిలా, విక్టర్లతో సంభాషిస్తూ

## బాల సంస్థలు

కార్మికుల కుటుంబాల్లో చాలామంది పిల్లలుండి. పెద్దవాళ్ళంతా మిల్లులో పనిచేస్తూ ఉన్నప్పుడు, పిల్లలను ఒంటరిగా యింట్లో వదిలిపెట్టడం సాధ్యపడదు. అందువల్ల మిల్లు తనదబ్బుపెట్టి బాగా గాలి వెలుతుర్లు వచ్చే, వెచ్చని (భారత దేశానికి వెచ్చదనం ముఖ్యం కాకపోవచ్చును, కాని రష్యాకు చాలా ముఖ్యం) రెండంతస్తుల యిళ్ళను

"కాని అనుకోవడానికి ఎవ్వరూ లేరే. నా భార్య నాతోబాటుగా చదువుతోంది, ఆమె కూడా విద్యాశాలనుండి పట్టంపొందబోతోంది. ఆమెకూడా మిల్లులోనే పని చేస్తోంది, నేతలో క్రొత్త పద్ధతులను కనిపెడుతూ, క్రొత్త రకం బట్టలను తయారుచేస్తోంది" అని ఆయన బదులు చెప్పారు.

"అంటే మీ కుటుంబంలోని వారంతా విద్యార్థులే నన్నమాట" అన్నాను నేను. "అంతేకాదు. నాతమ్ముడు విక్టర్ స్పిన్నింగ్ షాపులో అసిస్టెంట్ ఫోర్మన్‌గా పనిచేస్తున్నాడు. అతను కూడా కళాశాలలో మూడో సంవత్సరం విద్యార్థి, నాభార్య యిచ్చిన ఉపన్యాసాలకు హాజరయ్యాడు. ఆమె కళాలశాలలో నేత సిద్ధాంతం తరగతిని నడుపుతోంది."

ప్రతిచోటా యిదేకథ. ఇక్కడ యించుమించు ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడూ చదువుతున్నారు.

కుపవ్నాలో బాలోద్యానానికి వెళ్ళే పసివాళ్లు బట్టల పరిశ్రమ సంగతులు చదవరసుకొంది. వాళ్ళు నాట్యం చెయ్యడమూ, దేవతా కథలు చెప్పడమూ నేర్చుకుంటారు. అనగనగా గొర్రె పిల్లవున్న ఒక ముసలమ్మగురించి ఒక కథ గల తమ జీవితంలోని మొదటిపాటను కష్టపడి కంఠతా పెడతారు.







కార్మిక యువజనుల పాఠశాలలో ఒక పాఠం జరుగుతున్నది

☆

మిల్లుయొక్క ప్రత్యేక సెకండరీ పాఠశాలలో రసాయనిక శాస్త్ర పాఠం జరుగుతున్నది





మిహాహిల్ కొరత్కోవ్ షాపులోను, ఇన్స్టిట్యూట్‌లోను తన సహాధ్యాయినితో పాఠ్య ప్రణాళికా వ్యాసంగంలో







కుపవ్నా మిల్లుయొక్క రాత్రి ఆరోగ్య మందిరంలో, కార్మికులు టెలివిజన్ ప్రసార కార్యక్రమాన్ని చూస్తూ

కట్టింది. మిల్లులో పనిచేసే తల్లులు శిశుపోషణాలయం మిల్లు యొక్క అతి ముఖ్యమైన, ప్రప్రధానమైన "ఉపగ్రహం" అని అంటుంటారు; శిశుపోషణాలయం లాంటి "ఉపగ్రహం" లేకుండా మిల్లు అసలు నడుస్తుందని కూడా వాళ్ళు ఊహించలేరు. పనిరోజంతా పసివాళ్ళను యిక్కడ వదిలి పెట్టేస్తారు. అక్కడ వారికి బాగా ఆహారం యిచ్చి, శ్రద్ధ తీసుకుంటారు. ఖర్చుల్లో అధిక భాగాన్ని మిల్లే భరిస్తుంది. నేను శిశుపోషణాలయానికి వెళ్ళినప్పుడు పెద్దదాది అన్నా సరంత్సేవాను అడిగాను. వాళ్ళ అందరికంటె చిన్న "బేరగాశ్ని" చూపించమని మిహయిల్, అన్నా కొస్త్రోచ్కిన్ మూడు మాసాల కుమార్తె షురా కొస్త్రోచ్కినాను నాకు ఆమె చూపించింది తలి దండ్రులిద్దరూ మిల్లు కార్మికులే. ప్రతి బిడ్డ నేర్చుకునే మొదటి మాట అయిన "గూ' అనడము షురా చాలా శ్రద్ధగానేర్చు కుంటోంది.





రాత్రి విశ్రాంతి మందిరంలో డాక్టర్ నీనా బలబీనా మిల్లు ఉద్యోగి అన్నా కొస్త్రోచ్కినాతో మాట్లాడుతూ

శిశుపోషణాలయం నుండి వస్తోంటే వీధికి అడ్డంగా, బాలోద్యానవన గృహం వుంది. ఇక్కడ వుండేవాళ్ళు, పై తరంవాళ్లు—మూడేళ్ళనుండి ఏడేళ్ళ ప్రాయం వున్నవాళ్లు. నేను కుపవ్నాకు చలికాలంలో వచ్చాను. బాలోద్యానవనంలో ప్రవేశిస్తూ, పిల్లలు ఫిర్ చెట్టుకు ఆట బొమ్మలు, అలంకారాలు కడుతూ వుండడం నేను చూశాను వాళ్ళు కొత్త సంవత్సరం పండగకు సన్నాహాలు చేస్తున్నారు.

"ఆ కుర్రవాడు తన స్నేహితురాలి దగ్గర నుండి ఎంచక్కా అన్నలాగా ఆటవస్తువులు అందుకుంటున్నాడో చూడండి" అని అన్నాను ఉపాధ్యాయిని ల్యుద్మిల్లా బెలోవాతో.

"వాళ్లు అన్నా చెల్లెళ్లు" అందామె. "పీళ్ల ఒలోద్యా, గాల్యా కోస్త్రోచ్కిన్. ఒలోద్యాకు ఏడేళ్లు గత ఏడాది యిక్కడికి వచ్చాడు. గాల్యా కొత్తగా వచ్చింది. ఆ పిల్లకు నాలుగేళ్లే."

"మూడు మాసాలపిల్ల షురా కోస్త్రాచ్కినా సంగతేమిటి, శిశుపోషణాలయంలో ఆ పిల్లను నేను యిప్పుడిప్పుడే చూశాను. వీళ్ళకు ఆపిల్ల ఏమన్నా అవుతుందా?"

"అది వీళ్ళ చెల్లెలే" అంది ల్యుద్మిల్లా బెలోవా." "ఒకప్పుడు ఒలోద్యా, గాల్యా కూడా శిశుపోషణాలయానికి వెళ్ళారు. బాలోద్యానానికి రావడానికి వయసు వచ్చాక వాళ్లు యిక్కడికి రావడం మొదలుపెట్టారు. కొంత కాలానికి వీళ్ళంతా 32వ నెంబరు కుపవ్నా సెకండరీ పార



కుపవ్నాలో, టెలివిజన్ విస్తృత ప్రాచుర్యానికి నిదర్శన



కుపవ్నాలోని ఆహార విక్రయశాల

శాలకు వెళ్తారు."

నేను పాఠశాలకు వెళ్ళాను. అక్కడ నాకు యింకో ముగ్గురు కొస్త్రొచ్కిన్ పిల్లలు కనిపించారు. వాళ్ల పేర్లు యూరా, లూసియా, విక్టర్. "నేను ఇప్పుడు చూసిన 'ఉపగ్రహాలు' మిల్లుకు లేకున్నట్టయితే యీ ఆరుగురు పిల్లలూ యెక్కడ వుంటారు అని నే ననుకున్నాను...."

## పెద్దలకోసంకూడా

మిల్లు శ్రద్ధ వహించేది పిల్లల విషయంలో మాత్రమేకాదు. కుపవ్నాలో నే నున్నప్పుడు

మిల్లు భోజనశాలలో ఒక గది



కొస్త్రొచ్కిన్ కుటుంబంలో ఏడవ వ్యక్తిని కూడా నేను చూశాను. ఈ చూడడంకూడా మిల్లుయొక్క ఒక "ఉపగ్రహం"లోనే జరిగింది. ఈ ఆరుగురు బిడ్డల తల్లి అన్నా కొస్త్రొచ్కినా మిల్లు రాత్రి ఆరోగ్య మందిరంలో విశ్రాంతి తీసుకుంటోంది. రాత్రి ఆరోగ్య మందిరం కుపవ్నా మిల్లుకు మాత్రమే లేదు. ఇటువంటి ఆరోగ్య మందిరాలు మా దేశంలో



క్రీడా కేంద్రం, "గస్త్రానోమ్" ఆహార విక్రయశాల సాయంకాల దృశ్యం





చాలా అభిమాన పాత్రమైనవి. కార్మికులు జీతం మీద సంవత్సరపు సెలవులను పొందడం మాత్రమే కాకుండా, తమ పనిని వదిలిపెట్టకుండా వారు విశ్రాంతిని తీసుకోవచ్చును. వైద్య చికిత్సను పొందవచ్చును. రాత్రి మాత్రమే కాకుండా, స్త్రీగాని, పురుషుడుగాని పనిలో లేని పదహారు గంటలూ యిక్కడ విశ్రాంతిని పొందుతూ వున్నప్పటికి, యీ ఆరోగ్య మందిరాలను రాత్రి ఆరోగ్య మందిరాలంటారు. ఈ ఆరోగ్య మందిరంలో వుండే కార్మికునికి

చక్కని భోజనం లభిస్తుంది. నిత్య వైద్య పర్యవేక్షణలో వుంటాడు; పైన్-ఎక్స్ట్రాక్ట్ స్నానాలూ, క్వార్ట్జ్ రేడియేషన్, తదితర ఫిసియో-థెరపిటిక్ చికిత్సతో బాటుగా అవసరమైన వైద్యచికిత్సను పొందుతాడు. కుపవ్నాలో చాలా అభిమానాన్ని పొందిన చదరంగం ఆడతారు పాయంత్రం, లేకపోతే ముఖ్య పట్టణం నుంచి ప్రసారం చేయబడే టెలివిజన్ కార్యక్రమాలను చూస్తారు.

అన్నట్టు, కుపవ్నాలో టెలివిజన్ సెట్టంటే కార్మికులకు యెంతో యిష్టం. ఏ కార్మికుని యింటికెళ్లినా యిది తెలుస్తుంది.

కుపవ్నా మిల్లుయొక్క రాత్రి ఆరోగ్య మందిరం ఒక పెద్ద యింట్లోని మూడో అంతస్తులో వుంది. ఇదే గృహంలో యింకోరెండు 'ఉపగ్రహాలు" కూడా ఉన్నాయి. అవి కార్మికుల కాంటీన్, బట్టల మిల్లు కార్మికుల క్రీడా సంఘపు పెద్ద వ్యాయామశాల.

తమ విశ్రాంతి సమయాన్ని ఇంట్లో మంచి పుస్తకాన్ని చదువుతూ గడుపుదామనుకునే వాళ్ళకోసం, మిల్లుకు సంబంధించిన మూడు గ్రంథాలయాలు ఉన్నాయి—వస్త్ర పరిశ్రమకు సంబంధించిన పుస్తకాలు గల ఒక సాంకేతిక గ్రంథాలయం, ముఖ్యంగా సాహిత్య గ్రంథాలు గల ఒక కార్మిక సంఘ గ్రంథాలయమూ విద్యార్థులకు ఏ పాఠ్యగ్రంథమైనా లభించే రాజకీయ తరగతులకు సంబంధించిన గ్రంథాలయమూ.

జవహర్‌లాల్ నెహ్రూ 'భారత దర్శనం"కు యిక్కడ చాలా గిరాకీ వుంది.

కుపవ్నా మిల్లు కార్మికులైన మారియా రొజ్నోవా, లిడియా కొనసెంకో, మిల్లు డైరెక్టరు వి. ఎగొఫెమోవ్, ముఖ్య ఇంజినీరు బి. అబ్రమోవ్ గ్రంథాలు రచించారు. ఇవి ప్రదర్శించివున్న తావు, గ్రంథాలయానికి గర్వహేతుమైన ముఖ్యస్థానం. ఈ పుస్తకాలు కుపవ్నా బట్టలమిల్లు కార్మికులజీవితం గురించి, ఎవిని గురించీ, పాత కుపవ్నా కొత్తదవుతూ వుండడం గురించీ తెలియజేస్తాయి నేను యిప్పుడే మీకు తెలియజేసిన సోవియట్ పాలనలో స్థాపింపబడిన యీ "ఉపగ్రహాలు" పాత కుపవ్నా రూపాన్ని మార్చడానికి ఎలా తోడ్పడాయన్న దానిని గురించి కూడా ఈ పుస్తకాలు వివరిస్తాయి.



మిల్లు క్రీడాకేంద్రంలో జరుగుతున్న బాక్సింగ్ పాఠం







కుపవ్నా మేలురకం ఉన్ని బట్టల మిల్సులోని ట్రేడ్ యూనియన్ గ్రంథాలయం





లెనిన్‌గ్రాడ్‌లో వెన్నెల రాత్రుల ప్రారంభం

ప్రశ్నోత్తరాలు

# కుటుంబ సంబంధాలు

## < ఎ. బోరిన్ >

"సోవియట్ భూమి" సంపాదకులకు, సోవియట్ దేశంలోని వివాహ, విడాకుల చట్టాలగురించి సమాచరంకోసం పాఠకులు చాలా లేఖలు వ్రాస్తున్నారు. వివాహాలు ఎక్కడ, ఏవిధంగా జరుపబడతాయనీ, వివాహానికి ముందర వధూవరుల తలిదండ్రుల సమ్మతి తప్పక అవసరమా అనీ కొందరు తెలుసుకొనగోరుతున్నారు. వివిధ జాతులకూ, విభిన్న వృత్తులకూ, విద్యలకూ చెందినవారు వివాహమాడవచ్చునా అని కొందరడుగుతున్నారు. అవివాహితులకు జన్మించిన బిడ్డలకు గల హక్కులేమిటనీ, అవివాహితలైన తల్లుల భౌతిక సంక్షేమం గురించీ. అవివాహితులకు పుట్టిన పిల్లల తండ్రులకు సంఘంలో గల స్థానం గురించి, సోవియట్ దేశంలో విడాకులు జరిగే పద్ధతి గురించి మా భారతీయ మిత్రులు తెలుసుకొనగోరుతున్నారు.

ఈ ప్రశ్నలకు జబాబులిచ్చి, సోవియట్ దేశంలో కుటుంబానికి గల హక్కుల గురించి "సోవియట్ భూమి" పాఠకులకు తెలియజేయవలసిందిగా సంపాదకులు, న్యాయవాది ఎ. బోరిన్‌ను కోరారు. ఆయన యిచ్చిన సమాధానాన్ని యీ దిగువను ప్రచురిస్తున్నాము.

మా యింటి కిటికీలు ముందు వాకిలి వేపున ఉన్నాయి. ఎన్నో వందల యితర కిటికీలు వాటిని తేరిపార చూస్తున్నాయి. ఈ కిటికీలకు వెనుక నాకు బాగా పరిచయమైన కుటుంబాలు నివసిస్తు న్నాయి. అనేక ఏళ్లుగా సుఖంగా జీవిస్తూ, పనిచేసుకుంటూ, బాధ్యతలను నిర్వహించుకుంటూ వున్నవీ, యింతగా సుఖానికి నోచుకోనివీ యీ కుటుంబాలలో ఉన్నాయి.

### గ్రోమోవ్ కుటుంబంలో ఒక పెళ్లి

మూడవ అంతస్థు ఎడమ చివరనున్న కిటికీల వెనుక పెళ్ళి విందు జోరుగా సాగిపోతోంది. ఒక మోటారుకారు ఫాక్టరీ కార్మిక యువకుడైన ఇవాన్ గ్రోమోవ్, ఒక కలపదొడ్డి మోటారుకారు డ్రైవర్ ఎలీనా క్రసీనా యీవేళ వారి జిల్లా సివిల్ రిజిస్ట్రేషన్ ఆఫీసులో తమ వివాహాన్ని రిజిస్టరు చేసుకున్నారు.

తమ సివిల్ రిజిస్ట్రేషన్ వివాహానంతరం మత కర్మకాండతో చర్చిలో శాస్త్రోక్తంగా పెళ్ళిచేసుకునే దంపతులూ వున్నారు. ఇటువంటివి విధాయకంగా జరగాలని లేదు. ఇవి దంపతుల కోరిక ప్రకారం జరుగుతాయి. గ్రోమోవ్ దంపతులు తమ వివాహాన్ని సివిల్ రిజిస్ట్రేషన్‌తో సరిపుచ్చారు. ఇప్పుడు వారు పాతపద్ధతిలో విందుచేస్తున్నారు.

### "తండ్రులూ, బిడ్డలూ"

గ్రోమోవ్ కుటుంబంవున్న యింటిపై భాగంలో పెత్రోవ్ కుటుంబం వుంటుంది.

నేను తరచుగా ముసలమ్మ పెత్రోవాను కలుస్తుంటాను. తన కోడలిమీద ఫిర్యాదులు చేయడం అంటే ఆమెకిష్టం. తన కొడుక్కు, యీ భార్య తగదు. అతను అందమైనవాడనీ, తెలివైనవాడనీ మీకు తెలిసిందేగదా. అతని హోదాకు తగిన అమ్మాయిని పెళ్లాడమని ఆమె కొడుకుకు చెప్పింది. కాని ఈ రోజుల్లో పిల్లలు పెద్దవాళ్ల మాట వింటారా!

ఈ పెత్రోవ్ దంపతులు నిజంగా చాలా సుఖంగా వున్నారని చెప్పవలసివుంటుంది. వారు తొలి బిడ్డను ఎత్తుకోబోతున్నారు కూడా. ఇక తల్లి యీర్ష్య విషయమా? ఐదు ఖండాల్లోనూ యిది వున్నదేకదా!

ఆంధ్రప్రదేశ్‌కు చెందిన శ్రీ జి. కోటయ్య, న్యూఢిల్లీకి చెందిన శ్రీ సులకన్ సింగ్ మా దేశంలో వధూవరుల వివాహానికి తమ



తలిదండ్రుల సమ్మతిని పొందాలా, లేకపోతే తమ ప్రేమబలంమీద పూర్తిగా ఆధారపడి తామే యిందుకు బాధ్యతనంతా స్వీకరిస్తారా అని తెలుసుకొనగోరినందున పెత్రోవ్ కుటుంబం గురించి నేను చెపుతున్నాను.

సోవియట్ దేశంలో వివాహం పరస్పర ప్రేమాదరాలమీద, గౌరవంమీదా ఆధారపడి వుంటుంది. పద్దెనిమిదేళ్ళ వయసు వచ్చిన యువతీయువకులు (కొన్ని రిపబ్లిక్కులలో పదహారేళ్ళ ప్రాయం వచ్చిన వారు), తమ తల్లిదండ్రుల సమ్మతిని పొందకుండానే, తమ వివాహాన్ని రిజిస్టరు చేయించుకోవచ్చును.

ఎక్కువ సందర్భాలలో యువతీయువకులు తమ తలిదండ్రులతో సంప్రదిస్తారు, తమకంటె ఎక్కువ అనుభవంగల వారి సలహా తీసుకుంటారు. కాని మనం యిక్కడ ప్రస్తావిస్తున్నది తలిదండ్రుల సమ్మతి గురించి కాదు, యీ తలిదండ్రులు తమ పిల్లలపట్ల ఎంతగా అధికారాన్ని చెలాయించగలరన్నది మన ప్రస్తుతాంశం.

## గ్రిషా రోస్తొవ్ భావి

అప్పుడప్పుడు నా బాల మిత్రుడు గ్రిషా నాదగ్గరికి వస్తుంటాడు. వాడి వయస్సు నాలుగేళ్ళు. వాని తల్లి ట్రాలీబస్సు కండక్టరు, వాని తండ్రి....

"నాకు నాన్న ఎవ్వరూ లేరు" అని ఒకసారి వాడు నాకు చెప్పాడు. ఒకటి రెండేళ్ళయ్యాక, యీ చిన్నవాడికి సంగతి సందర్భాలు అర్థం అవడం మొదలయ్యాక, యిందువల్ల బాధపడతాడుగదా అని నేను విచారించాను. హోమినైద్యాకు చెందిన శ్రీ జగ్దీష్ ప్రవాద్ "అవివాహితులకు పుట్టిన బిడ్డకు సోవియట్ దేశంలో యెటువంటి హోదా వుంటుంది? ఆ బిడ్డతల్లి హోదా ఏమిటి?" అని అడిగిన ప్రశ్నను చదివినప్పుడు నాకు గ్రిషా జ్ఞాపకం వచ్చాడు.

గ్రిషా తల్లి అన్నా స్తెపనోవ్నా రోస్తోవా, వాని తండ్రిని ప్రేమించింది. కాని అతను ఆమెను పెళ్ళి చేసుకోవడానికి యిష్టపడలేదు. ఆమెనూ, ఆమె బిడ్డనూ వాళ్ళగతికి వాళ్ళను వదిలిపెట్టేశాడు.

అన్నా స్తెపనోవ్నాకు జీవితం సుఖంగా లేదన్న విషయం నిజమే. తండ్రి సలహా, తండ్రి అండదండలూ వానికి అవసరమయ్యే రోజులు గురించి ఆలోచించి ఆమె బాధ పడుతోంది....కాని ఆమె అవివాహితురాలైన తల్లి అయినందువల్ల పనిలోగాని, యింటివద్దగాని ఆమెను యెవ్వరూ, ఎన్నడూ అవమానించడంగాని, తేలిక చేయడంగాని చేయలేదు. అన్నా స్తెపనోవ్నా ఒక తల్లి—అంతే చాలు. పెద్దవానిని ప్రేమించినందుకు సోవియట్ ప్రజలు ఒక స్త్రీని విరసించరు. తండ్రి సహాయం లేకుండా తన బిడ్డను పెంచడం కష్టమైనప్పటికీ, తన బిడ్డ హక్కులు, వివాహితులకుపుట్టిన బిడ్డల హక్కులూ ఒక్కటేనని అన్నా స్తెపనోవ్నాకు తెలుసు. ఇది తెలియడంవల్ల, ప్రభుత్వం నుండి గ్రిషా పోషణ కోసం నెలనెలా ఆమెకు రాబడి వస్తుండడం వల్ల ఆమెకు ధైర్యమూ, యీ బాధ్యతను నిర్వహించడానికి బలమూ కలుగుతున్నాయి. కావాలంటే ఆమె గ్రిషాను ప్రత్యేక బాలమందిరంలో చేర్పవచ్చును. అక్కడ ప్రభుత్వ



వ్యయంతో వాణ్ని పెంచుతారు. తన కిష్టమైనప్పు డెప్పుడైనా ఆమె వాణ్ని తిరిగి ఇంటికి తీసుకవెళ్ల వచ్చును.

ఇక అవివాహితులకు జన్మించిన బిడ్డ తండ్రిస్థానం విషయం—శ్రీ జగ్దీష్ హోతియర్ యీ ప్రశ్న నడిగారు—, తమ బిడ్డలను వదిలిపెట్టేసిన తండ్రులను మేము నిరసిస్తాము, పిల్లలు వివాహితులకు జన్మించిన వారయినా, అవివాహితులకు జన్మించిన వారైనా. ఇటువంటి తండ్రుల ప్రవర్తన అవినీతిగా పరిగణింపబడుతుంది. వారి తోడి పనివారూ, పత్రికలూ వారిని తరచు బహిరంగంగా విమర్శిస్తాయి.

## విడాకులు

మా యింటి మొదటి అంతస్థులోని స్నెగిరేవ్ యింట్లో చాలా రోజులుగా దీపాలు వెలగడంలేదు. ఆ దంపతులు విడిపోయారని యెవ్వరో నాకు చెప్పారు. వీరా ఇవనోవ్నా స్నెగిరేవా, వదిం పెత్రోవిచ్ స్నెగిరేవ్‌మీద విడాకులకు దావా వేసినట్టు సాయంత్రం వార్తాపత్రికలో నిన్న ఒక ప్రకటనను చదివాను. వారి జిల్లా ప్రజా న్యాయస్థానంలో యీ దావా విచారణకు వస్తుంది. విడాకులు దావాలలోని చర్యలలో ఒకటి, యిటువంటి ప్రకటనలు.

తమ దావా న్యాయస్థానంలో రెండుసార్లు విచారణకు వస్తుందని స్నెగిరోవ్ దంపతులకు తెలుసును. న్యాయస్థానం మొదటిసారి యీ దావాలోని యదార్థ విషయాలను నిర్ణయించి, యిద్దరికీ సమాధానం కుదర్చడానికి ప్రయత్నిస్తుంది. ఇందులో వారు విఫలులైనట్టయితే, వాది పై న్యాయస్థానానికి అపీలు చేస్తుంది. అది దావాను విచారణచేసి విడాకులకు సమ్మతి లేదా నిరాకరణ గురించి తన నిర్ణయాన్ని అందజేస్తుంది. భార్యా భర్తల మధ్య సంబంధాలనూ, యిందుకు సంబంధించిన బిడ్డలున్నారేమో అన్న విషయాన్నీ, అది సహజంగా గమనిస్తుంది,

మానవ భావాలలోని వ్యక్తిత్వం, క్లిష్టత, ప్రత్యేకతలను పూర్తిగా పరిగణించి, భర్తయొక్క, లేదా భార్యయొక్క అభిమతానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్నిచ్చి వుంటుంది, మా శాసన నిర్మాణం. కాని తల్లి పిల్లల ప్రయోజనాలు ఏ విధంగానూ భగ్నం కాకుండా రక్షణ కూడా యిస్తుంది, అదే సమయంలో. ఈ విషయంలో సోవియట్ శాసన నిర్మాణం బలమైన కుటుంబ సంబంధాలను వాంఛిస్తుంది.



అన్నా కెరినీనా
పాత్రధారిణి
ఎ. ఆంద్రియేవా

# యువనటి తొలినటన

లియో టాల్‌స్టాయ్ నవల "అన్నా కెరినీనా"ను అనుసరించి వ్రాయబడిన నాటకం, గత యిరవై ఏళ్లుగా మాస్కో ఆర్ట్ థియేటర్ ప్రదర్శిస్తోన్న నాటకాలలో ఒకటి. ఈ సంవత్సరం యువ నటీమణి ఎ. ఆంద్రియేవా కథానాయకి పాత్రను ధరించింది.

వ్రాన్‌స్కీ పట్ల తనకుగల పరిశుద్ధమైన నిర్మల ప్రేమ ప్రేరణచే అన్నా కెరినీనా తన భర్తను వదిలిపెట్టి, ఆ విధంగా సాంఘిక సాంప్రదాయాలను సవాలు చేయడానికి నిశ్చయించుకుంటుంది. కాని న్యాయశాస్త్రం ఆమె భర్తకు అనుకూలంగా వుంది: ఇంకొకరిని ప్రేమించకుండా అన్నా నిరోధింపబడింది, కుటుంబంలో నుండి వెళ్ళిపోకుండా ఆమెకు ఆటంకం కల్పింపబడింది. కాని అన్నా ధైర్యంగా దుష్ట సాంప్రదాయాలను, లోకవంచననూ యెదుర్కొంటోంది, తన కుమారుని యెడబాటును సహిస్తోంది. కాని పరిస్థితులు యింకా ఆమె జీవితాన్ని విషమింప జేశాయి. ఆమెకు విడాకులు యివ్వడానికి ఆమె భర్త అంగీకరించలేదు, కొడుకును పంచుకని అన్నాను వదిలి పెట్టేస్తాడు, ఆమె అవిధేయత చేత గౌరవింపబడి, ఉన్నత సమాజాన్ని యెదుర్కొనమని, ఆమెను మూకల పాలబడ జేస్తాడు. కాని యింతకంటె అన్యాయమైన విషయమేమిటంటే, ఆమె నైతిక శక్తికి ఉత్తేజాన్నిచ్చే ఆధారాన్ని కోల్పోతుంది. ఎందువల్లనంటే తాను ఎవరి కోసమైతే త్యాగాలు చేసిందో ఆ వ్రాన్‌స్కీకి సాంప్రదాయాలను ధిక్కరించే ధైర్యం లేకపోయింది, అతను ఆమెనింకా ప్రేమించడంలేదు. తనకిక గత్యంతరంలేదని అన్నా కెరినీనా ఒక రైలుబండి క్రింద పడి పోతుంది.

అన్నా యొక్క క్లిష్టమైన, సంఘర్షిస్తున్న భావాలూ, కష్టపరిస్థితిలో సక్రమ నిశ్చయంకొరకు ఆమె అన్వేషణ, ఒక ప్రేమికి సాహసం—యీ పాత్రలో నటి యెదుర్కోవలసిన క్లిష్టమైన మానసిక సమస్య లిటువంటివి. ఎ. ఆంద్రియేవా వీటిని సమర్థంగా నటించి సంపూర్ణ ప్రశంసలకు అర్హత సంపాదించుకుంది. ఆమె నటన విరాడంబరంగా, సహజంగా వుంది. కథానాయకి అంతర్గత భావాలనూ, టాల్‌స్టాయ్ నవలలో చిత్రింపబడిన సాంఘిక దుర్దశనూ ఆమె ప్రస్ఫుటం గావించింది.

ఈ కష్టమైన ముఖ్యపాత్రలో ఆంద్రియేవా తొలి నటన అత్యంత జయప్రదమైంది, మాస్కో ప్రేక్షకులు ప్రతిభావంతు రాలయిన యీ కొత్తనటిని సంపాదించినందుకు, ఆర్టు థియేటరును అభినందించారు.

★ ★ ★ ★ ★

## ఉత్తం బార్వే, వ్లాదిమిర్ కనిన్

(15వ పుట తరువాయి)

రోజుల్లో నేను పనినుండి యింటికి వచ్చి భోజనంచేసి, వార్తా పత్రిక చదివి నా టెలివిజన్ సెట్టు పని ప్రారంభిస్తూంటే (యిప్పుడు నాకోసం ఒక టెలివిజన్ సెట్టును తయారు చేసుకుంటున్నాను) మా అమ్మాయి నా ఒళ్ళోకెక్కి, నేను దానికి చదివి చెప్పాలని అడుగుతుంది. ఆ సరికి సాయంత్రం అయిపోతుంది. అయినా నేను ఏదో విధంగా కాస్త చదువుతాను. అన్నట్టు ఉత్తం బార్వేకి పెళ్ళయ్యిందా?"

బొంబాయిలోని నా కొత్త పరిచయస్తుని గురించి నాకు తెలిసింది చెప్పాను.

కనిన్ నేను చెపుతూన్న దానిని శ్రద్ధగావిని, తరవాత తాను పనిలోనికి వెళ్ళేటప్పుడు తరచుగా తీసుకవెళ్ళే చిన్న సూట్ కేసులో నుంచి పసుపు పచ్చని అట్టగల ఒక పుస్తకాన్ని తీశారు. దాని పేరు "భారతీయ జానపద కథలు", దిగువను "మాస్కో, 1956" అని ముద్రించి వుంది.

"నేను దీనిని మా అమ్మాయికోసం కొన్నాను. కాని నాకే యిది చాలా బాగుంది. ట్రాములో పనికి వెళ్ళేటప్పుడూ, తిరిగి ఇంటికి వచ్చేటప్పుడూ చదువుతున్నాను."

ఆయన *129* వ పుటను విప్పి, "ఐదు పూల రాణి" అన్న కథను తీసి, యీ ప్రాచీన భారతీయ ప్రతిభా శకలాన్ని యీ విధంగా చదివారు: "ప్రతి సమావేశమూ ఎడబాటుకు ప్రారంభమనీ, ప్రతి ఎడబాటూ మళ్ళీ సమావేశానికి అవకాశమనీ సర్వదా జ్ఞాపకం పెటుకోవాలి."

తా నెన్నడూ చూడని భారతీయ మిత్రులను కలుసుకోగలనని కనిన్ ఆశిస్తున్నారు.



# మాస్కో, పెర్వొమెయ్‌స్కి జిల్లా, ఉత్సవ సన్నాహ కార్య సంఘ ఉపాధ్యక్షుడు, ఫైదొర్ అగరిషెవ్‌తో ఇంటర్వ్యూ

దొర్ అగరిషెవ్ కోటుకు ఒక డజనుకు పైగా చక్కని బాడ్జీలు తగిలించివున్నాయి. గుండ్రనివీ, చదరంగా వున్నవీ, వజ్రాకారంలో వున్నవీ; యెర్రనివీ, నీలపువీ, గులాబీరంగునీ, పసుపు పచ్చనివీ. వాటి రంగులు ఎండలో ఇంద్ర ధనుస్సులాగా మిలమిలా మెరుస్తూ వుంటాయి. ఉత్సవపు బాడ్జీల నమూనాలివి. జిల్లా కార్యాలయాలలోనూ, పరిశ్రమలలోనూ పనిచేసే యువజనులు విదేశాలనుండి వచ్చిన అతిధులకు బహూకరించడానికి తయారు చేయబడుతున్న వివి.

"చక్కనిది, అందమైనది, మౌలికమైనది ఏదో ఒకటి ఆలోచిద్దామనుకుంటారు ప్రతి ఒక్కరూ. అందుచేతనే యీ నమూనాలు పెట్టుకున్నాను, తమ పొరుగువారేమి చేస్తున్నారో యితరులకు చూపడానికి" అంటూ వివరించారు అగరిషెవ్. "మాయువజనులు ఉత్సవంకోసం ఆతృతగా రోజులు లెక్క పెట్టుకుంటూ వున్నారు. పని గంటల తరవాత సాయంత్రం మీరు మా జిల్లాలోని పాఠశాలలకూ పరిశ్రమలకూ, కార్యాలయాలకూ వెళ్ళినట్లయితే అమెచ్యూర్ సంగీత కచేరీలతోనూ, కార్నివాల్స్‌తోనూ, యువజనుల వేడుకలతోనూ, క్రీడా సమావేశాలతోనూ, అంతులేని రిహార్సల్సుతోనూ ప్రతి ఒక్క సంస్థా సతమతమవుతూ వుండడం మీకు కనిపిస్తుంది. కాని రిహార్సల్సు, సమావేశాలూ, అమెచ్యూర్ సంగీత కచేరీలూ మాత్రమే కాదు. 143 దేశాలనుండి వచ్చే ముప్పయ్యయిదు వేలమంది యువతీ యువకులు ఆరవ ప్రపంచ యువజనోత్సవానికి హాజరవుతారుగదా మరి? మాస్కో పౌరుడైన ప్రతి యువకుడూ అతిధులతో మాటాడాలనీ, వారికి ముఖ్యపట్టణాన్ని చూపించాలనీ, తన గురించి చెప్పుకోవాలనీ అభిలషిస్తాడు. అంచేత తీరికచేసుకుని భాషలను నేర్చుకోవడం అవసరం.

"ఇతర దేశాల చరిత్ర, సంస్కృతి, ఆచార వ్యవహారాలు తెలియకపోయినట్టయితే, మీ అతిధులతో మీరు ఎలా మాటాడ గలుగుతారు? ఇందువల్ల భారతదేశం, ఫ్రాన్సు, జర్మనీల సాహిత్యాన్ని చదవడానికీ, వాటిగురించి ఉపన్యాసాలకు హాజరుకావడానికీ తీరిక చేసుకోవాలి. విదేశాలగురించి మా యువజనులకు ఆసక్తి చాలా వుంది. అయినా, బహుశా అన్నిటి కంటె ఎక్కువగా ఆసక్తిని రేకెత్తించేది భారత దేశమేమో.



"భారత దేశానికి వెళ్ళిన డి. క్రమినోవ్, వి. క్మరావంటి పత్రికా రచయితలూ, బి. చిర్కోవ్, యస్. చుయ్‌కోవ్, యన్ చెర్కాసోవ్‌వంటి కళాకారులూ వ్రాసిన యాత్రానుభవాలను ఎంతోమంది ఆతృతగా చదువుతారు. టాగూరు, ప్రేంచంద్, అబ్బాస్ మొదలైన భారతీయ రచయితల రచనలు గొప్పగా ప్రజాభిమానాన్ని పొందుతున్నాయి. భారత దేశ గ్రంధ పాఠకుల సమావేశాలూ, యీ మహాదేశంతో మైత్రికిసంబంధించిన సభలూ జిల్లాలో జరుగుతున్నాయి; వీటికి మాస్కోలో వుంటున్న భారతీయులు, భారత దేశానికి వెళ్ళివచ్చిన పత్రికా రచయితలూ ఆహ్వానింపబడుతున్నారు. మాస్కోకు మా ప్రియమిత్రుల రాకకోసం ఎదురు చూస్తూ, మా యువతీ యువకులూ, బాలలూ బహుమానాలను తయారుచేస్తున్నారు. సైంటిఫిక్ ప్లాస్టిక్స్ ఇన్‌స్టిట్యూట్ యువ కార్మికులు ప్లాస్టిక్స్‌తో ఒక గుచ్ఛాన్ని తయారు చేశారు. ఇది చీకటిలో వివిధ వర్ణాలతో మెరిసిపోతుంది. ఎంతగా చక్కని కుట్టుపనులూ, కర్రతోనూ, కొమ్ముతోనూ ఎన్నెన్ని చెక్కడపు పనులూ, ఎలుగుబంట్లనుండి రైలు రోడ్డువరకూ ఆటబొమ్మలూ ఉత్సవంకోసం మా పిల్లలు తయారు చేస్తున్నారో!



"ఉత్సవానికి ముందటి యీ రోజుల్లో మాస్కోలో ఎన్నో నవ్వులూ, రొదలూ, గమ్మత్తులూ, పాటలూ సాగిపోతున్నాయి. మాస్కో యువజనులు ఆతృతగా తమ అతిధులకోసం వేచివుంటున్నారు."

---



అకార్డియన్ వాయిస్తోన్న ఎలుగుబంటి. దారుశిల్పం. మాస్కోలోని 407వ నెంబర్ పాఠశాల, మూడవ ఫారం విద్యార్థులు సమిష్టిగా ఉత్సవానికిచ్చిన కానుక (పైన)

మాస్కోలోని 480వ నెంబర్ పాఠశాల విద్యార్థి వి. వాశెనెవ్, ఉత్సవానికి కొమ్ముతో తయారు చేసిన బ్రాబు కొయ్య (పైనుండి మూడవ చిత్రం)

సామ్యవాద అనుకరణ ఒడంబడిక జరిగినప్పుడు.

ఆ స్నేహ చరిత్రలోని ఒక పుట యిదిగో:

1941 డిసెంబరులో ఫాసిస్టులు గెనిచ్ జిల్లా మీద దండయాత్ర చేశారు, ఇళ్ళూ, పొలాలూ వదిలి ప్రజలు పారిపోవలసి వచ్చింది. నిజమైన స్నేహితులవలె శ్రోమ్ గ్రామవాసులు తమ ఉక్రెనియన్ మిత్రులను జార్జియాకు ఆహ్వానించి, వారికి తోడుపడ్డారు "మాకున్నదానిని అన్నదమ్ముల్లాగ పంచుకుందాం" అన్నారు వారు. చాలామంది స్త్రీలు, పిల్లలు, వృద్ధులూ, గాయపడిన సైనికులూ యీ ఆహ్వానాన్ని స్వీకరించారు. బంధువులవలె వారు శ్రోమ్ గ్రామానికి ఆహ్వానింపబడ్డారు. శ్రోమ్ ప్రజలు నాలుగు వందలమందికి పైగా యుద్ధరంగంలో పోరాడుతుండేవారు. సోవియట్ సేనకు ఒక టాంకుల దళాన్ని బహూకరించడానికి, శ్రోమ్ సమిష్టి రైతులు విరాళాలు యిచ్చారు. దానికి "ఉక్రెయిన్ విముక్తిదళం"అని పేరు పెట్టుకున్నారు.

దురాక్రమణదారులు ఉక్రెయిన్ నుండి తరిమివేయబడిన తరవాత, గెనిచ్ జిల్లా సమిష్టి రైతులు తిరిగి యిళ్ళకు వచ్చారు. శ్రోమ్ ప్రజలు తమ మిత్రులకు మూడు కార్లనిండా పశువులనూ, ధాన్యాన్నీ, బట్టలు, గృహోపకరణాలూ పంపారు

ఇది జరిగి పదమూడేళ్ళయింది. ఆతరవాత గెనిచ్ జిల్లాలో సాధారణ పరిస్థితులేర్పడ్డాయి. అది పశు ప్రజననంలో పెద్ద విజయాలను సాధించినందువల్ల మఖరద్జె జిల్లా రైతులకు యీ విషయంలో ఆ సమిష్టి రైతులు సాయపడగల స్థితిలో వున్నారు. మఖరద్జె జిల్లా రైతులు కూడా పళ్ళ పెంపకం, ద్రాక్ష పెంపకం విషయంలో తమ ఉక్రేనియన్ మిత్రులకు సాయపడదామనుకున్నారు. జార్జియా నుండి తోటమాలీలు గెనిచ్ జిల్లాకు వెళ్ళి ఉక్రేనియన్లకు తమ అనుభవాన్ని చెప్పారు. ఆరు హెక్టార్ల భూమిలో (15 ఎకరాలు) ద్రాక్ష తోటలు పళ్లతోటలూ వేశారు. ఇప్పుడు మఖరద్జె జిల్లాసమిష్టిరైతులు వెయ్యికిపైగా నిమ్మచెట్లనూ అనేకవేల ఆపిలు, [illegible], [illegible] మొక్కలనూ తమ గెనిచ్ జిల్లా మిత్రులకోసం పెంచుతున్నారు.

మఖరద్జె సమిష్టి క్షేత్రంలో [illegible] జార్జియన్, ఉక్రేనియన్ భాషల్లో "స్నేహపు పళ్ళ తోట"అన్న బోర్డులు కట్టివున్న పళ్ళతోటలు కనిపిస్తాయి. ఈ తోటల పంటను జార్జియన్ సమిష్టి రైతులు ప్రతి సంవత్సరమూ తమ ఉక్రేనియన్ సోదరులకు కానుకగా పంపుతుంటారు.

"మాకున్న మంచివాటిని మా స్నేహితుల కివ్వడం, మాకు ఆచారం"అంటారు మఖరద్జె జిల్లా ప్రజలు.

★

మఖరద్జె జిల్లా సమిష్టి రైతులకు యీ అందమైన గుర్రం కానుకగా వచ్చింది



# స్వాతంత్ర్యం! స్వాతంత్ర్యం!

## (ఇండొనీషియాలో కె. వై. ఒరొషిలోవ్)

వేయిద్వీపాలదేశం ఇండొనీషియా, చైనాకు వెళ్ళి వచ్చిన సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ సభాపతి కె. వై. ఒరొషిలోవ్‌కు ఘన స్వాగతం యిచ్చింది.

"మెర్దెకా!" (స్వాతంత్ర్యం).

ఈ మాటతో లక్షలాదిమంది ఇండొనీషియన్లు, అతిథి పలకరించుకున్నారు.

ఇండొనీషియన్, సోవియట్ ప్రజలమైత్రికి యీమాట చిహ్నమయ్యింది; స్వాతంత్ర్యాన్నే, సంపూర్ణ జాతీయ స్వాతంత్ర్యాన్నే ఇండొనీషియా ప్రజలు వలస రాజ్యాధిపతుల కుట్రలకూ, వారి తాబేదారులైన అభివృద్ధి నిరోధకుల ప్రయత్నాలకూ వ్యతిరేకంగా కాపాడుకుంటూ వుండడంవల్ల. ప్రపంచంలోని సకలప్రజలకూ పీడిత దేశాలన్నిటికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు 1917 అక్టోబరులో స్థాపింపబడినప్పట్నుండీ, యీ భావం సోవియట్ దేశ పతాకం పైన వుంది

ఒక సంవత్సరం క్రిందట, సోవియట్ దేశంలో వున్నప్పుడు, తమ దేశ స్వాతంత్ర్య సమరంలో ఒక ప్రముఖ నాయకుడు, ఇండొనీషియా అధ్యక్షుడు, డాక్టర్ సుకర్నో ఇండొనీషియన్, సోవియట్ ప్రజల మైత్రి గురించి యిలా అన్నారు: "కళ్లకు దూరంగా వున్నా, హృదయానికి చేరువగావున్నది" సోవియట్ దేశానికీ, ఇండొనీషియాకూ మధ్య వేలాది కిలోమీటర్ల దూరంవుంది. కాని వాటి ప్రజల మధ్యస్నేహం కొంగ్రొత్తగా, బలంగావుంది, వారిపరస్పర సానుభూతి నిర్వికల్పంగా వుంది. ఒకదానికొకటి ఎంతోదూరంగావున్న, విభిన్న సాంఘిక వ్యవస్థలతోవున్న యీ రెండుదేశాల మైత్రికిగల పునాదుల గురించి విశదీకరిస్తూ, పలితిగా నగరంలో కె. వై. ఒరొషిలోవ్ గౌరవార్థం జరిగిన సభలో ఉపన్యసిస్తూ ఇండొనీషియా అధ్యక్షుడిలా అన్నారు:

"శరీర వర్ణంలోనూ, భాషలలోనూ తేడా వున్నప్పటికీ ఒకరికీ ఒకరికీ మధ్య చాలాదూరం వ్పటికీ సోవియట్ ఇండొనీషియన్ ప్రజలు, మూడు విషయాల్లో మనం ఏకీభవించి వుండడంవల్ల, ఐక్యంగా వున్నారు. మొదటిది, సోవియట్ దేశం సకల ప్రజల జాతీయ స్వాతంత్ర్యాన్ని ఎంతో గౌరవిస్తుంది, దానిని అన్నివిధాలా బలపర్చుతుంది. స్వాతంత్ర్యంకోసం విప్లవాన్ని సాధించిన మేముకూడా అంతే. రెండోది, సోవియట్ దేశం సంపూర్ణమైన జాతీయ న్యాయంకోసం పోరాడుతుంది. మేమూ అంతే. మా ఆదర్శాలు కూడా అవే: వర్ధిల్లే సమాజం, ప్రజల సంక్షేమం, సౌఖ్యం. మూడవది, సోవియట్ ప్రజలు శాంతి కొరకు, యుద్ధానికి వ్యతిరేకంగా పట్టుదలతో పోరాడుతున్నారు. మేముకూడా అదేవిధంగా పోరాడుతున్నాము."

ఇండొనీషియాలో వున్నప్పుడు కె. వై. ఒరొషిలోవ్ ఎక్కడికి వెళ్ళినా, జావాకుగాని, బాలీద్వీపానికిగాని, కొత్త ముఖ్యపట్టమైన జకర్తాకుగాని, పాత ముఖ్యపట్టణమైన ప్రాచీన జొక్జకర్తాకుగాని ఎక్కడికి వెళ్ళినా, గడ్జామదీ విశ్వవిద్యాలయవిద్యార్థులనుగాని, వరి, రబ్బరు

### అంతర్జాతీయ సమీక్ష

క్షేత్రాల రైతులను కలుసుకున్నా, సోవియట్ ప్రజల రాయబారికి మిత్రునికివలె, సోదరునికివలె, నిండుహృదయంతో, నిజమైన స్నేహభావంతో స్వాగతం లభించింది.

బాండుంగ్‌లో ఆయనకు చాలా గొప్ప స్వాగతం యివ్వబడింది. ఘోరువర్షం కురుస్తున్నప్పటిక ఆ నగరం జనాభాలో నాలుగింట మూడువంతులమంది, ఆరు లక్షల ప్రజలు ఆయనకు స్వాగతం యివ్వడానికి వచ్చారు. బాండుంగ్ ప్రజల నుద్దేశించి ఒరొషిలోవ్ "సోవియట్ ప్రజలు బాండుంగ్‌ను ఎరుగుదురు, అంతేకాదు, ఆసియా, ఆఫ్రికా దేశాల ప్రతినిధులు—మానవజాతిలో అధిక సంఖ్యాకులు—బలవత్తరమైనశాంతి, స్వతంత్ర ప్రజల స్నేహసౌభ్రాతృత్వాలకొరకు ప్రపంచానికి హెచ్చరించడానికి సమావేశమైన స్థలంగా దానిని చాలా ప్రేమిస్తారు కూడా"నని అన్నారు.

ఇండొనీషియా యువజనులు ఒరొషిలోవ్‌కు ప్రత్యేకమైనఉత్సాహంతో అభివాదాలర్పించారు. జొక్జకర్తావిశ్వవిద్యాలయ విద్యార్థుల, ఉపాధ్యాయులసభలో ఒరొషిలోవ్ యువజనుల పాత్ర గురించి యీ విధంగా చెప్పినప్పుడు చాలాసేపు కరతాళ ధ్వనులు మ్రోగాయి: "యువజనులైన మీరు దేశ నిర్మాణంలో ముఖ్యపాత్రను నిర్వహిస్తారు, ఇండొనీషియన్ ప్రజల జాతీయ విముక్తి సమరంలో యువజనులుమహత్తర శక్తిగావున్నారన్నది చరిత్రలో లిఖింపబడింది.........జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించుకున్న తరవాత మీకు గొప్ప అవకాశాలులభించాయి. 'వృద్ధులమైన మేము కలిసినట్టయితే ఒక కొండను కదిలించగలము. కాని యువజనులందరూ కలసినట్టయితే, ప్రపంచాన్నంతట్నీ మార్చివేయగలరు' అని తాష్కెంట్ సభలో అధ్యక్షుడు సుకర్నో అన్నది సంపూర్ణ సత్యం. గతంలోని వలసపరిపాలనలోని జీవితంవల్ల కలిగిన ఫలితాలను అధిగమించవలసి వుంది, మీ దేశాన్ని ప్రపంచంలో గొప్పగా అభివృద్ధి చెందిన దేశాలలో ఒకదానిగా చేయవలసి వుంది."

పూర్వపు వెనుకబడిన వలస దేశాన్ని అభివృద్ధిచెందిన అభ్యుదయకర దేశంగా పరివర్తనంగావించే కర్తవ్యనిర్వహణలో, ఇండొనీషియాకు సోవియట్ దేశం తప్పని సరిగా తోడుపడుతోంది. ఫాసిస్టు మూకలపైని సోవియట్ సేనలు కొట్టినదెబ్బలు, జపానీస్ దురాక్రమణదారులను తరిమివెయ్యడానికి ఇండొనీషియాకు సాయపడ్డాయి. 1946 జనవరిలో ఉక్రేనియన్ సోవియట్ రిపబ్లిక్ ప్రతినిధి, యీ కొత్త రిపబ్లిక్కు వ్యవహారాలలో బ్రిటిష్ సాయుధ జోక్యానికి వ్యతిరేకంగా చర్యలు తీసుకోవలసిందిగా భద్రతా సమితికి మొదటగా విజ్ఞప్తి చేశారు. 1948 లో భద్రతా సమితిలోని సోవియట్ ప్రతినిధి, ఇండొనీషియా స్వాతంత్ర్యానికి భంగం కలిగించిన డచ్చివలస రాజ్యాధిపతులను ఖండించవలసిందిగా హెచ్చరించారు. ఇప్పుడుమళ్లీ కె. వై. ఒరొషిలోవ్ ఇండొనీషియాలో అంతర్భాగమైన పశ్చిమ ఇరియన్‌ను తమకు యిచ్చివేయవలసిందిగా ఇండొనీషియన్ ప్రజలు చేస్తోన్న డిమాండులు న్యాయమైనవనీ, న్యాయశాస్త్ర సమ్మతమైనవనీ సోవియట్ ప్రభుత్వాభిప్రాయాన్ని పునరుద్ఘాటించారు.

సోవియట్ దేశం ఇండొనీషియాకు స్వార్థరహితంగా భౌతిక, సాంకేతిక సహాయాన్ని

(మిగత 37వ పుటలో)

# ఆంతొన్ ఛెకోవ్ జీవితం

ప్రసిద్ధ రష్యన్ రచయిత ఆంతొన్ ఛెకోవ్, 1860 లో జన్మించి, 1904 లో నలభై నాలుగు సంవత్సరాలు నిండీ నిండకముందే మరణించారు.

తండ్రి ప్రతిభావంతుడే, అయినప్పటికీ ఆయనొక అతి వ్యతిరిక్తపు మనిషి. మనసారా పిల్లల శ్రేయస్సునుకోరి, వాళ్ళను పెంచి పెద్ద చేసి విద్యావంతుల చెయ్యటానికి పాటుపడ్డాడు. సాక్షాత్తూ ఆయనలో వున్న ఈ యోగ్యతలన్నీ, కపటంవల్ల, పిల్లల విషయంలో ఆయన పట్టిన మూర్ఖపు పట్టువల్ల బాగా వక్రించాయి. కొరడాను ప్రయోగించే ఒక కర్కశ క్రమశిక్షణను కుటుంబంలో ప్రవేశపెట్టి, అక్షరాలా దాన్ని పాటించాడు.

పరువు తక్కువైన శిక్షలు, శారీరక హింసలు, కనికారంలేని క్రమశిక్షణ, అసహ్యమైన కుటుంబ దృశ్యాల నేపథ్యంలో ఛెకోవ్ బాల్యపు రోజులు గడిచాయి. అందుచేతనే "నాకు బాల్యంలోనే బాల్యం లేదు" అన్నారు. "క్రౌర్యం, కాపట్యం మా బాల్యాన్ని యెంత ఛిన్నాభిన్నం చేశాయంటే, ఆ రోజులను జ్ఞాపకము చేసుకోవడానికే భయంతో కుంచించుక పోతాను."

బాల్యపు తొలి రోజుల, యవ్వనకాలపు స్మృతులే దుఃఖావిలమై, మానవుల కష్టాలకు బాధలకు ప్రతిస్పందిస్తూ, నైచ్యత, కాపట్యం ఏ రూపంలోవున్నా దానికి తలొగ్గక దృఢ చిత్తంతో యెదుర్కొనే మౌలికమైన ఆయన ప్రతిభ, అనన్య సామాన్యంగా బహుముఖంగా విస్తరించడానికి మూలాధారం కాదా?

*రచయిత అయిన ఛెకోవ్*

పాఠశాల చదువు ముగించుకొని అంతోన్ ఛెకోవ్ విశ్వవిద్యాలయంలో ప్రవేశించారు. డాక్టరు కావడానికి శిక్షణ పొందుతున్నారు.

బ్రతుకు తెరువుకు నాలుగు డబ్బులు ఆర్జించుకోవలసిన అగత్యం ఆ యువక విద్యార్థికి ఏర్పడింది. చిన్నచిన్న హాస్య పత్రికలకు వ్యంగ్య, దృశ్యాత్మక రచనలు, శీర్షికలు స్వల్ప బత్తెంకోసం రాసేవారు. ఆయన కథలూ, వ్యంగ్య రచనలూ ప్రసిద్ధికెక్కిన, ఆ విషయం ఆయన తెలుసుకునే టప్పటికి, 19 సంవత్సరాల అంతోన్, ఆయన సహోదరులలో ఒకరుకాదు, పేదరికానికి గురియై మాస్కోకు తరలిపోయిన తమ కుటుంబానికి పోషకుడైనాడు.



గురుతరమైన నైతిక, ఐహిక బాధ్యతలతో కూడిన ఆ కాలమే— ఆయన నడవడికను ఒక మనిషిగా, రచయితగా రూపొందించుటలో విశిష్ట పాత్రను ధరించింది. కష్టభూయిష్టమైన అంతః పరీక్షలో, నిర్విరామమైన పరిశ్రమలో ఆయన గడిపిన గడ్డు కాలమది. దీనికంతటికీ మూలాధారమైన ప్రేరణ, బహుశా, బహిష్కరించదగిన ప్రతిఅంశంపట్ల, మానవత్వ ఉన్న చూపు చూసే ప్రతి అంశంపట్ల, ఆయనకున్న గాఢమైన జుగుప్స— భావి కృషికి నిర్దేశన చేసిన ఒక అనుభూతి కావొచ్చు.

**> ఎఫ్. కుజెనెత్సోవ్ <**

*"కుదింపు ప్రతిభకు తోబుట్టువు"*

తనొక మనిషిగా పెంపొందగలగడమే ఛెకోవ్, ఒక రచయితగా కూడా పెంపొందగలగడమని భావించారు. చిన్న పత్రికలకు ఆయన రాసిన కథలేగాని, స్వల్ప రచనలేగాని అనన్య సామాన్యమైన ప్రతిభావిస్ఫూర్తులతో విశిష్టంగా వ్యక్తమవుతుంటాయి. ఆ కాల్పనికత, శైలీ, మనోవైచిత్రీ, ముమ్మూర్తులా ఆయనవే. వాస్తవానికి ఛెకోవ్ రష్యన్ సారస్వతంలో సాధారణ జీవిత చిత్రీకరణంలో "విప్లవం" తెచ్చి, రెండుమూడు పుటలు మించని సంక్షిప్త చారిత్రక కథను, అమలినమైన ఇతిహాసపు మహా కావ్యస్థాయికి తీసుకవెళ్ళారు.

ఛెకోవ్ రచనా వైశిష్ట్యం, భావ వ్యక్తీకరణకు సంక్షిప్తతను కళాత్మక సాధనగా చేసుకోవడమే. ముక్తసరిగా చెప్పడం ఆయన కళ. "కుదింపు ప్రతిభకు తోబుట్టు" వనేవారు ఛెకోవ్. "సుదీర్ఘ విషయాలను కుదించి చెప్పడం, నేను నేర్చుకున్నాను" అని తన్నుగురించి వ్రాసుకున్నారు. ఇందులోనే వుంది ఆయన అద్వితీయ ప్రతిభ.

*దేనిని గురించి రాశారు ఛెకోవ్?*

ఆయన తీసుకొన్న ఇతివృత్తాల పరిధి, అందులో ప్రతిబింబితమైన సమస్యలు, చిత్తవృత్తులు విస్తృతమైనవి. కథానికలలో, స్వల్ప రచనలలో సామాజిక జీవిత వికృత రూపాలన్నింటినీ ఖండించి, ప్రపంచ సారస్వతంలోని ఉత్తమ వ్యంగ్య రచనలతో తులతూగే వ్యంగ్య సాహిత్య రత్నాలను సృష్టించారు.

"కార్పొరల్ ప్రిషిబ్యేవ్," "ఊసరవెల్లి" "లావుకారు, సన్నకారు" అనే రెండునుంచీ 4 పుటలు మించని కథలలో, ఆ వ్యంగ్య రచయిత చిరస్మరణీయమైన పాత్రలను— సంతృప్తి, గులామీ తత్వం, కాపట్యాలకు మరో పేరులైన మూర్తులను సృష్టించారు. ఇతర రచనలలో ఛెకోవ్, మనకు ఉద్విగ్నభావ శిఖరాలను అందుకొనే ఉత్తమ కావ్య శిల్పిగా, నిగూఢ మానవ హృదయానుభవ శకలాలను వెలికితెచ్చే, వివృతం చేసే గవేషకునిలా సాక్షాత్కరిస్తారు.

ఆయన విస్తృత రచనా వస్తువుకు కీలకంగా వున్నది "సామాన్యుడు," వీధిమనిషి, మానవ జీవితంలో బహిష్కరించదగిన దానితోటీ, కాపట్యంతోటీ సాగుతున్న సంఘర్షణ. సాధారణ దైనిక జీవితంలోనుంచి కృతనిశ్చయుడైన రచయిత ఈ వస్తువును అతి సంగ్రహంగా ఏరుకుంటాడు. అయితేమటుకు, ప్రతి చిన్న కథలోనూ భావ పరంపర ఎంత శబలంగా, వాహిరిల్లుతుంటుంది, ఎంత తీవ్రభావ ప్రకోపాన్ని కలిగిస్తుంది, ఛెకోవ్ పుస్తకాలు అతి వినమ్రుడైన పాఠకుని సైతం ఉద్విగ్నుణ్ని చేస్తాయి, కదలిస్తాయి!

ఉదాహరణకు— ఒక చిన్న దృశ్యాన్ని, రెండు పుటలకన్నా మించని "జాలికరం" అనే ఖండికను తీసుకోండి.

గ్రియోర్గీ పెత్రోవ్, టర్నర్— తన పనిలో దక్షుడని జిల్లా అంతటా పేరుమోసిన వాడు, మరణావస్థలోవున్న తన భార్యను బండ్లో

ఆసుపత్రికి తీసుకపోతున్నాడు. మంచు పేరుక పోవటమకాకుండా ఆనాడు, మంచు తుఫాను కొడుతున్నది. ఊగిసలాడుతూ పోతున్నప్పుడు గ్రియోర్గీ పెత్రోవ్, ఆ వృద్ధురాల్తో నలభై ఏళ్ళు కాపురం చేసిన విషయాన్ని గురించి ఆలోచింపసాగాడు. ఈ నలభై ఏళ్లలోనూ ఆవిడ "ఎరిగిన మనిషి" తనిప్పుడు కాదనీ, ఇప్పుడెంతో తను మంచివాడైనాడనీ, దయాళు వనీ, ఆవిడంటే తనకెంతో ప్రేమఅనీ ఆవిడకు చెప్పాలనుకున్నాడు. ఏంలాభం, అందుకు సమయం దాటిపోయింది. టర్నర్ లోపల్లోపలే కుళ్ళికుళ్ళి. కునుకు తీశాడు, తీరా ఆసుపత్రి దగ్గర మేలుకున్నాడు.

"....నీ చేతులకూ కాళ్ళకూ ఇంక వీడ్కోలు చెప్పు....వాటిని చల్లో గడ్డకట్టించావు! ఇప్పుడు ఇంకిప్పుడు....ఎందుకు ఏడుస్తున్నావు! నీకు ఆయుష్షు నిండేంతవరకూ జీవించావు! అరవ య్యోపడి నిండేంతవరకూ—నువ్వు జీవిస్తే, ఇంతకన్నా నీపని అధ్వాన్నమవుతుంది, కాదూ? నేను పందెంకట్టి చెప్పగలను!" అని చెప్పాడు డాక్టర్ అతనికి.

"ఇదెంతో జాలికరమైంది! ఎంతో విషణ్ణ మైంది! ఒక మనిషి ఇట్లా చెబుతున్నం దుకు మీరు కాస్త క్షమించండి. నేనే గనక ఇంక అయిదారు సంవత్సరాలు జీవించగలిగి తేనా...."

"ఎందుకు?"

"ఆ గుర్రం, అది నాదీ కాదు, దాన్ని తిరిగి యిచ్చేసెయ్యాలి....అదుగో ఆ ముసల్ది దాన్నిప్పుడు పూడ్చిపెట్టాలి....ఈ మన ప్రపంచంలో ప్రతిదీ ఎంత తొందరగా జరుగుతున్నది!"

కట్టుతెగిన ఆ మనిషి దుఃఖం, జీవితంలో ఎప్పుడూ ఎదురయ్యే విషాద హాస్యాల క్రూర సంయోగం, దాన్ని పసికట్టే వివేకవంతమైన ఛెకోవ్ చూపు మనల్ని కంపింప జేస్తుంది.

రష్యా సారస్వత చరిత్రలోకి ఛెకోవ్ మానవతను ప్రదీప్తం చేసే పుత్పన్నుడైన రచయితగా, బాధాభరితమైన మానవ వేదనకు ప్రతిస్పందించే మృదుల హృదయునిలా, మహత్తరమైన హాస్యకథా రచయితగా అడుగు పెట్టారు. అయితే ఛెకోవ్ హాస్యం ప్రత్యేక శ్రేణికి చెందింది, అది "కన్నీళ్లలో చిరునవ్వ డం." రష్యా విశిష్ట వ్యంగ్య రచయిత, గొగోల్, తన్ను గురించి—తాను జీవితాన్ని దృగ్గోచరమవుతున్న వెలుతురులో మంచే కాదు, దృగ్గోచరంకాని అజ్ఞాత దుఃఖ బాష్పాలలోనుంచి సైతం చూచానని చెప్పుకున్న మాటలు, ఛెకోవ్‌పట్ల చక్కగా అన్వయిస్తాయి.

### సర్వాంగ సౌందర్యం

వృత్తిరీత్యా వైద్యుడు కావడంవల్ల ఛేకోవ్‌కు ప్రజలంటే తెలుసు, వాళ్ళను ఎంతో ప్రేమించారు. 1890లో ఊగిసలాడే బండిలో జబ్బుతో వుండగా, సుదూరద్వీపం సఖాలిన్‌కు వెళ్ళారు. జార్లచేత ప్రవాస శిక్ష విధించబడి, కఠినమైన శ్రమకు గురిచేయబడ్డ వాళ్ళందరూ ఇక్కడికే పంపబడేవారు. అక్కడ, ఆ ద్వీపంలో పాద చారంగా పోతూ ఛిన్నాభిన్నం చేసే జీవిత

(మిగతా 37వ పుటలో)

# నాకు అప్పుడే నయమైంది

చిత్రకారుడు :
వ్లాదిమిరోవ్.



మొల్లాకు జబ్బుచేస్తే, బంధువులు ఆయన్ను పరామర్శించడానికి వచ్చారు. చుట్టంచూపుగా వచ్చినవాళ్ల ఎంతసేపటికీ లేవక పీఠం పెట్టుకుంటే ఆయనకు విసుగెత్తింది. పక్కమీంచి లేచి,
"నాకు అప్పుడే నయమయ్యింది. ఇంక మీరంతా ఇప్పుడు ఇప్పుడు ఇంటికిపోవచ్చు" అని అన్నాడు.



# సింహాళ సౌహార్ద్ర ప్రతినిధివర్గం

సింహాళంనుండి వచ్చిన పార్లమెంటు సభ్యుల ప్రతినిధివర్గ మొకటి యిప్పుడు సోవియట్ దేశంలో పర్యటిస్తూవుంది. దానిలో 19 మంది సింహాళ పార్లమెంటు ప్రముఖ సభ్యులున్నారు. అతిథులు మూడు వారాలపాటు దేశంలో పర్యటించారు, యూనియన్ రిపబ్లిక్కులకు వెళ్లారు, సోవియట్ ప్రజలతో అనేకసార్లు సమావేశమయ్యారు. సింహాళ ఆర్థిక మంత్రిత్వశాఖ పార్లమెంటరీ కార్యదర్శి, ప్రతినిధివర్గ నాయకుడు అయిన సెనెటర్ చంద్రదాస విజయసింగెను మా విలేకరి కలుసుకున్నారు.

ఈ దిగువ ఆ యింటర్వ్యూను ప్రచురిస్తున్నాము.

*"సోవియట్ దేశ పర్యటనలో మీకు కలిగిన అభిప్రాయాలేమిటి ?"*

"మంచి సదభిప్రాయాలు కలిగాయి. మేము చాలా పరిశ్రమలనూ, ప్రభుత్వక్షేత్రాలనూ, సమిష్టి క్షేత్రాలనూ చూశాము. మీ దేశములో కార్మికులు బాగా సమీకరింపబడి వున్నారనీ, ముడిపదార్థాల ఆధారాలు బాగా ఉపయోగింపబడుతున్నాయనీ మా అభిప్రాయం. మానవ జీవితంలోని సంస్కృతి, ఆత్మిక విషయాలపట్ల గొప్ప శ్రద్ధ చూపబడుతోంది. వీటన్నిటితోబాటుగా మీ ప్రజలు సహృదయులని, ఆతిథేయ సత్కారాలు చేసేవారనీ తెలుసుకున్నాము."

*"మీ పర్యటనలో అన్నిటికంటె ఎక్కువగా మీకు నచ్చిన దేమిటి ?"*

"సోవియట్ ప్రజల శాంతి వాంఛ. ఒకప్పుడు మీ దేశంలోకి వెనుకబడిన ప్రాంతంగా వున్న మధ్యాసియా రిపబ్లిక్కులకు మేము వెళ్ళాము. ఇప్పుడు మేము ఏకకుటుంబంలోని సోదరులనుచూశాము. ఒకొక్క సోదరునికీ స్వీయమైన ప్రత్యేక లక్షణాలున్నాయి. కాని వారందరూ శాంతి స్నేహాలతో జీవించ నభిలషిస్తున్నారు. మా దేశములో సోవియట్ దేశానికి వ్యతిరేకంగా చాలా ప్రచారం సాగుతోంది. రష్యను ముప్పు, రష్యన్ ప్రమాదం వచ్చిపడుతున్నాయన్న సాకుతో యీ ప్రచారం జరుగుతోంది. స్వదేశానికి మేము తిరిగి వెళ్లాక మేము చూసిన ప్రతి ఒక్కదానిగురించి సింహా. ప్రజలకు చెప్పి, మా ప్రజలు యిక యీ అబద్ధాన్ని నమ్మకుండేటట్లుగా మేము శాయశక్తులా కృషిచేస్తాము."

*"సోవియట్-సింహాళ సంబంధాలు యిటీవల ఏ విధంగా పెంపొందుతున్నాయి ?"*

"ప్రస్తుత ప్రభుత్వం 1956 ఏప్రిల్‌లో ఏర్పడింది. అది తీసుకున్న మొదటి చర్యలలో ఒకటి, చైనా ప్రజారిప్లక్‌తోనూ, సోవియట్ దేశంతోనూ దౌత్య సంబంధాల స్థాపన. చైనా ప్రజారిపబ్లిక్‌కు సింహాళ రాయబారి యిప్పుడు పెకింగ్‌లో వున్నారు, సోవియట్ దేశానికి మా రాయబారి యీ నెలలో మాస్కోకు చేరుకుంటారు. చైనా ప్రజా రిపబ్లిక్‌తో మేము సన్నిహితమైన వాణిజ్యసంబంధాలు సాగిస్తున్నాము. ఆ దేశంతో వాణిజ్య ఒడంబడికకు సంబంధించిన ఐదేళ్ళ గడువు ఈ ఏడాదితో ముగుస్తోంది, ఇది ఆగస్టులో పునరుద్ధరింప బడుతుందని ఆశిస్తున్నాము. సోవియట్ దేశంతోకూడా వ్యాపారం చేయాలని మేము అనుకుంటున్నాము. సింహాళం చిన్న ద్వీపదేశం మా జనాభా ఎనభై లక్షలకు కాస్త యెక్కువగా మాత్రమే వుంది. కాని జయప్రదంగా వ్యాపారం చేయగల మనుకుంటాను."

*"సింహాళం ఏ వస్తువులను ఎగుమతి చేస్తుంది, సోవియట్ దేశంలో మీరేమి కొనాలనుకుంటున్నారు ?"*

"మీ దేశానికి పనికివచ్చేవి మావద్ద చాలా వస్తువులున్నాయి ; మొదటిది, తేయాకు. తరవాత రబ్బర్, కోకో, కొబ్బరికాయలు. సోవియట్ దేశంనుండి మేము యంత్ర పరికరాలు, దుక్కి ఇనుము, ఉక్కు, సిమెంట్, పత్తి మేము కొనగలము. మన దేశాలమధ్య వాణిజ్య విషయం యిప్పుడు పరిపక్వమైవుందనీ, సమీప భవిష్యత్తులో యిది ఆలోచింపబడుతుందనీ అనుకుంటున్నాను. సాంస్కృతిక, క్రీడా సంబంధాల విస్తరణ గురించి కూడా మేము ఆమోదిస్తున్నాము."

(మిగత ప్రక్కపుటలో)

మాస్కో, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ యూనియన్ సోవియట్ అధ్యక్షులు ఏ. పి. లొబొనోవ్, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ జాతుల సోవియట్ ఉపాధ్యక్షులు వి. టి. కొమరోవ్, సింహాళ దేశ పార్లమెంటు ప్రతినిధివర్గానికి ఏప్రిల్ 25న క్రెమ్లిన్‌లో స్వాగతమిస్తున్న దృశ్యం



[ముందుపుట తరువాయి]

"సోవియట్ ప్రజలతో మీ సమావేశాల గురించి మాకు చెప్పండి."

"దేశంలో మేము చేసిన పర్యటనలో, యూనియన్ రిపబ్లిక్కుల నాయకులను మేము కలుసుకున్నాము. మాకు ఆసక్తిగల విషయాలన్నిటి గురించి పూర్తిగా సమాచారాన్ని పుచ్చుకున్నాము. కాని కొన్ని విషయాలు బాగా స్పష్టంకాలేదు. వీటిని ఎ. మికోయాన్ మాకు వివరించారు. రాజకీయ వేత్తల మధ్య వ్యక్తిగత సమావేశాలు, మన దేశాలను యింకా సన్నిహితంగా తీసుకవస్తాయి."

"మాస్కోకు సింహళ పార్లమెంటు సభ్యుల ప్రతినిధివర్గం రాకకు మీ అభిప్రాయంలో ఎటువంటి ప్రాధాన్యత వుంది?"

"మాది సింహళంనుంచి సోవియట్ దేశానికి వచ్చిన రెండవ అధికారపూర్వక ప్రతినిధివర్గం. మేము సుహృద్భావ సందేశంతో వచ్చాము. మన దేశాలు స్నేహంగా వుంటున్నాయి. స్నేహితులు ఒకరిదగ్గరకు ఒకరు వెళ్తుండాలి. పార్లమెంటుసభ్యుల ప్రతినిధివర్గాల రాకపోకలు, అన్ని విధాలా ప్రోత్సహింపబడాలి."

---

## స్వాతంత్ర్యం! స్వాతంత్ర్యం!

(33వ పుట తరువాయి)

చేస్తోంది. ఇండొనీషియా ప్రజలకు యీ నర్వతో ముఖమైన సోవియట్ దేశపు అంద గురించి తెలుసును, దాని మైత్రిని ప్రశంసిస్తున్నారు. ఇండొనీషియాలో ఒరొషిలోవ్‌కు యివ్వబడిన స్వాగతం దీనిని సువిశదం గావిస్తుంది.

అవును, ఆసియాలో వలస రాజ్యాధిపత్యానికీ, యుద్ధ ప్రమాదానికి వ్యతిరేక పోరాటంలో ఒక బ్రహ్మాండమైన శక్తి వుంది. ఈ శక్తి చైనా, భారతదేశం, ఇండొనీషియా, సోవియట్ దేశాల మహా ప్రజల మైత్రి. వీరి శాంతియుత ఆశయాలు, మానవజాతిలో అధికసంఖ్యాకులు నివసించే ప్రపంచంలోని ఆ భాగపు ప్రజలచే ఆమోదింపబడుతున్నాయి.

ఒరొషిలోవ్ ఇండొనీషియాలో వున్నప్పుడు, ఆయన అక్కడనుండి వియత్నాం ప్రజాస్వామిక రిపబ్లిక్కుకు వెళ్తారని తెలిసింది. ఈ వార్తను విని వియత్నాం ప్రజలు ఎంతో సంతోషించారు. సౌభ్రాతృత్వ, స్నేహయాత్ర సాగిపోతూంది.

---

## ఆంతోన్ ఛెకోవ్ జీవితం

[35వ పేజీ తరువాయి]

సత్యాన్ని "సఖాలిన్ను గురించిన కథలు" అన్న పుస్తకంలో రాశారు.

ఈ ద్వీప పర్యటన రచయితను బాగా కదిలించింది. సఖాలిన్‌నుంచి తిరిగి వచ్చాక ఆయనకు రష్యా సమస్తం, ఒక కర్కశ శ్రామిక శిబిరంలా కనుపించింది. ఆ రోజుల్లో రాశారు "ఆరో నెంబర్ వార్డు"న్న తన ప్రసిద్ధ రచన. రష్యన్ సారస్వత చరిత్రలో నిరంకుశత్వాన్ని, అవినీతినీ, హింసాకాండనూ ప్రతిఘటించి తీవ్రంగా నిరసించినవాటిలో ఇదొకటి. న్యాయశీలుడూ, చతురుడూ అయిన ఒక వ్యక్తిని మందబుద్ధులు పిచ్చాసుపత్రిలో పెట్టి, హింసించడమే ఈ విషాదగాథ. "నిన్న సాయంత్రం, ఈ కథ చదవడం పూర్తి చేసేసరికి, నేను ఎంత భయపడ్డానంటే, ఒంటరిగా నా గదిలో ఉండలేకపోయ్యాను. లేచి బయటికెళ్ళాను." అన్నారు దీన్ని చదివాక వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్. "ఆరో నెంబర్ వార్డు"కు మన సమకాలికులు ఇదేవిధంగా ప్రతిస్పందిస్తారు.

ఛెకోవ్ రచనయొక్క సామాజిక ప్రయోజనాత్మకత, నాటి జారుల రష్యాలోని జీవితపు మూలకందాలపట్ల ఆయన అసంతృప్తి హెచ్చిన కొద్దీ, ఏటేటా వర్ధమానమవుతూ వచ్చింది. ఉత్తమ మానవులను గురించీ, మానవాళి మనోహర భవిష్యం గురించి ఇంకా ఉద్విగ్నంగా కలలు కన్నారు. దేశాన్ని ఉజ్వల భవితవ్యానికి తీసుకపోగలిగే శక్తులు యెక్కడున్నాయి; రష్యాను యెవరు ఆ ఉజ్వల గమ్యానికి తీసుకపోతారు?— ఈ ప్రశ్న ఆయన్ను మరింత బాధించింది, వేధించింది.

దయా స్వభావులూ నిర్మల హృదయులూ, సచ్ఛీలురైన ప్రజలపట్ల; "ఆరో నెంబర్ వార్డు" లోని నాయకుడు రాగిన్, "అంకుల్ వాన్యా" లోని డాక్టర్ ఆస్త్రోవ్, "మిగత"లోని దైమోవ్ లాంటి వాళ్ళపట్ల ఛెకోవ్‌కు యెంతో సానుభూతి వుండేది. అయితే సాధువులు, దయా హృదయులు, సౌజన్యవంతులైన వీళ్ళు, ప్రపంచాన్ని మార్చే వీరులుకాదు. ఛెకోవ్, తన్ను అమితంగా అణచివేసిన భయంకరమైన, కర్కశ ప్రపంచాన్ని యెట్లా, ఎవరు మార్చాలన్న ప్రశ్నకు సమాధానాన్ని కనుక్కోలేకపోయినారు.

అయినా, ఈ స్రష్ట న్యాయ, కారుణ్య లక్ష్యాలు విజయం పొందుతాయన్న విషయంలో యెన్నడూ తన విశ్వాసాన్ని కోల్పోలేదు.

"మనిషికి ప్రతిదీ సుందరంగా వుండాలి— ముఖము, దుస్తులు, ఆత్మ ఆలోచనలు" అంటాడు ఒక ఛెకోవ్ భూమికపాత్ర. ఉన్నత మానవుణ్ని గురించి ఆయన కన్నకలలు "అంకుల్ వాన్యా", "సీగల్", "సంపెంగ తోట" మొదలైన నాటకాలలో రూపులు దిద్దుకొన్నాయి. రష్యన్ నాటక చరిత్రలో, వాటిదొక శకం. ధ్వని యుక్తమైన నిగూఢ భావ చిత్రణలో, "అంతర్వాహినిలా" తరంగిత మయ్యే ఉద్విగ్న ప్రేరణలో వాటిశక్తి గర్భితమై వుంది.

ఛెకోవ్ నాటకాల్లో, రష్యాపట్ల ఆయనకున్న గాఢానురాగం, దాని భవిష్యత్తుపట్ల వున్న అచంచల విశ్వాసం, ప్రస్ఫుటంగా వ్యక్తమైనాయి.

"సంపెంగ తోట"లోని ఒక పాత్రనోట— "సుఖతర భవితవ్యానికి సంబంధించిన పూర్వజ్ఞానం నాకున్నది" అని తన మాటగా పలికిస్తాడు ఛెకోవ్.

"నేను దాన్ని స్పష్టంగా చూడగలుగుతున్నాను.... అదుగో ...అది, సౌఖ్యం, దగ్గరకొస్తున్నది, దాని అడుగుల సవ్వడి నేను వినగలుగుతున్నాను. మనం—ఇప్పుడు దాన్ని చూడకపోతే, గుర్తించకపోతే మటుకేం? ఇతర్లు చూసి తీర్తారు!"

తన రచనలద్వారా ఛెకోవ్, ప్రజల ఉజ్వల భవితవ్యం కోసం పోరాటానికి పిలుపునిచ్చారు. లిఖితాక్షర శిల్పులైన రష్యన్ మహామహుల కోవకెక్కింది ఆయన పేరుకూడా.

# డున్నో వాని మిత్రబృందమూ చేసిన సాహస కృత్యాలు

ఎన్. నొసోవ్

## ఆసుపత్రిలో

వాళ్ళు తలుపుదగ్గరకెళ్ళారు, మంచుముక్క చిన్న గంటను గణగణమని వాయించింది. ఒక నర్సు తలుపు తెరిచింది. "అయ్యో దేవుడా! యింకో జబ్బుమనిషి!" అని ఒగిర్చిందావిడ, వాళ్ళనుచూసి. "అతగాణ్ణి పెట్టడానికి జాగా లేందే! ఒట్టువేసి చెపుతున్నాను! వీళ్ళంతా ఎక్కణ్ణుంచి ఊడిపడ్డారు? ఏడాది పొడుగునా ఆసుపత్రి కాళీగా పడివుంది. ఈ వాళ పదిహేనుగురు జబ్బు మనుషులు ప్రవేశించారు!"



"ఈయన జబ్బుమనిషికాడు, తన స్నేహితుణ్ని చూడడానికి వచ్చాడు" అని చెప్పింది మంచు ముక్క.

"ఓహో, అలా అయితే లోపలికి దయ చెయ్యండి."

డున్నో, ఆ అమ్మాయిల డాక్టరు కచేరి లోనికి వెళ్ళాడు. అక్కడ ఒక డస్కుదగ్గర కూచొని మధుభక్షి కనిపించింది. మంచు ముక్కనూ, గడ్డిపూవునూ చూడగానే ఆ అమ్మాయి యిలా అంది :

"మీరు జబ్బు మనుషులుల్ని చూడ్డానికి వొచ్చారుగదూ? నేను చూడనివ్వను. జబ్బు మనుషులకు ప్రశాంతంగా వుండాలని తెలీమా?"

"మేము జబ్బు మనుషుల్ని చూడ్డానికి రాలేదు. ఈ కుర్రాడు చూడ్డానికి వచ్చాడు. వాళ్ళు యితగాడికి స్నేహితులు"అంది మంచు ముక్క.

"హూ హూ, మంచంమీద పడుకుని వుండమని ఆ కుర్రాడికి చెప్పాను. కాని యిక్కడికి వచ్చాడు, డాక్టరుమాట వినకుండా షికార్లు కొడుతున్నాడు." ఈ సమయంలో మధుభక్షిని పిలిస్తే బయటికి వెళ్లింది. డున్నోకు అక్కడ చిలక్కొయ్యకు తగిలించి ఒక స్మోక్, టోపీ కనిపించాయి. వెంటనే అతను అవి వేసుకున్నాడు, డస్కుమీద మధుభక్షి వదిలి పెట్టిన కళ్ళద్దాలు కూడా పెట్టుకున్నాడు. తరవాత ఆ అమ్మాయి కర్ర బాకా పుచ్చుకుని గదిలోనుంచి బయటికి వెళ్లిపోయాడు.

అతను వసారాలోనుంచి వెళ్ళి, తనస్నేహితులున్న వార్డు తలుపులు తెరిచాడు. మొదటి మంచంమీద గ్రుంప్సవున్నాడు, ఎన్నడూ లేనంత విచారంగా వున్నాడు.

డున్నో బాకాతో అతని తలమీద కాస్త తట్టాడు.

"గ్రుంప్స, నువ్వేమీ మారలేదే" అన్నాడు. గ్రుంప్స ఆశ్చర్యంతో చూశాడు.

"డున్నో!" అన్నాడతను.

"ఉష్!"అని డున్నో హెచ్చరించాడు.

"విను, డున్నో, నేను యిక్కణ్ణుంచి బయట పడడానికి సాయంచేద్దూ" అని గుసగుస లాడేడు గ్రుంప్స.

"ఏదన్నా చేస్తాలే" అన్నాడు డున్నో. "ఆ అమ్మాయిలు బెలూన్ ఎవరు చేసారని అడిగితే, నేను చేశానని చెప్పు, చెప్తావా?"

"నువ్వు చెప్పమన్నట్టు చెప్తాను" అన్నాడు గ్రుంప్స.

*తరవాతనతను ప్రక్కమంచందగ్గరకెళ్లాడు,* అక్కడ డాక్టర్ పిల్మజా పడుకుని వున్నాడు.

"నన్ను కాపాడు!" అని గుసగుసలతో అన్నాడు, డాక్టర్ పిల్మజా ఆందోళనతో. "నువ్వే ఆలోచించు. మేమందరమూ ఆరోగ్యంగా వున్నాము, కాని వాళ్ళు మమ్మల్ని యిక్కడ పెట్టేశారు. వాళ్ళు మా బట్టలన్నీ తీసుకవెళ్లిపోయారు, మాకు చేతిరుమాళ్లు తప్పితే యింకేమీ యివ్వలేదు. మేమిక్కడ చేయగలిగిందల్లా, పడుకుని చీదడం."

"ఆసుపత్రికి మీరెందుకు వచ్చారు?"

"నిన్నరాత్రి మేము బుట్టలోంచి పడిపోయి, అలా నిద్రపోయాము. మర్నాడు ప్రొద్దుట కొందరు పిల్లలు మమ్మల్నిలేపి, మీ రెక్కణ్నుంచి వచ్చారని అడిగారు. క్రిందకు పడిపోయిన బెలూన్లో మేము వచ్చామనిచెప్పాము. "పడిపోయిందా!?" అన్నారు వాళ్లు. 'దెబ్బలు తగిలాయా.'' అని అడిగారు వాళ్లు. 'అయితే మీరు మా ఆసుపత్రికి రావాలి.' ఈ ప్రకారంగా మేమిక్కడికి వచ్చాము."

డున్నో ఒక మంచంనుండి యింకో మంచం దగ్గరకు వెళ్ళాడు, తానే బెలూన్ చేసినట్టుగా చెప్పమని తన స్నేహితులందర్నీ హెచ్చరిస్తూ. చివరికి డాక్టరు కచేరీకి తిరిగి వెళ్ళాడు.

*సరిగ్గా అప్పుడే మధుభక్షి తిరిగి వచ్చింది.*

"ఆ స్మోక్ వేసుకొమ్మని ఎవరు చెప్పారు నీకు?"అంది మధుభక్షి కోపంగా. "ఇటువంటి అవిధేయత నేనెన్నడూ చూడలేదు!"

"నేను అవిధేయంగా లేనే" అన్నాడు డున్నో, "నా స్నేహితులెలావున్నారో కాస్త చూడడానికి వెళ్ళాను."

"అయితే వాళ్ళెలా వున్నారు?"అనిఅడిగింది మధుభక్షి వెటకారంగా.

"ఒక్కడు తప్పితే తక్కినవాళ్ళంతా బాగున్నారు, ఆస్పత్రినుండి వెళ్ళిపోవచ్చును."

"ఏమిటీ!" అని కేకేసింది మధుభక్షి చెదిరిపోయి, "పద్ధాలుగురు కుర్రాళ్లనీ ఒకేసారి వదిలిపెడితే ఏంజరుగుతుందో తెలుసా? వాళ్లు ఊరు తలక్రిందలు చేసేస్తారు! ఒక్క యింటికీ కిటికీలు వున్న వున్నట్టుగా వుండవు. మా అందరికీ ఒళ్ళంతా దెబ్బలతోనూ, బొడిపెలతోనూ నిండిపోతుంది. కుర్రాళ్ళను ఆసుపత్రిలోనే అట్టిపెట్టాలి. దెబ్బలూ, బొడిపెలూ అంటువ్యాధి రాకుండావుండాలంటే."

డున్నో చాలా కారణాలు చెప్పాక మధుభక్షి ఒప్పుకుంది, "మేము జాబితా తయారు చేసి రేపు వాళ్ళను వదిలి పెడతాము" అంది.

"అందరికంటె మంచి వాళ్ళతో మొదలు పెడతాము" అందామె, డున్నోవేపు తిరిగి.

"అందరికంటె మంచి వాళ్లెవరు?"

"వాళ్లందరూ మంచివాళ్లే"అన్నాడు డున్నో.



"ఇది నన్ను నువ్వు నమ్మించలేవు. కుర్ర వాళ్లెప్పుడూ మంచిగా వుండరు. వాళ్ళు అల్లరి చెయ్యకుండా వుండాలంటే, వాళ్ళకు ఏదో ఒక పని అప్పగించాలి."

అలా అయితే బెండంనూ, ట్విస్టుంనూ మొదట బయటికి పంపుదాము. వాళ్లు బయటికి పోగానే కారు మరమ్మత్తు చేయడం మొదలు పెడతారు" అంది గడ్డిపూవు.

"గొప్పగా ఉంది" అంది మధుభక్షి. "అయితే బెండం, ట్విస్టుం జాబితాలో మొట్ట మొదట వుంటారు."

ముందుగా తయారుచేసిన జాబితా ప్రకారం, తవుటి పురుగులను ఆస్పత్రిలో నుంచి వెళ్ళనిచ్చారు.

## డూనో వచ్చాడు

తవుటి పురుగుల ఆచూకి దొరికినందుకు కుర్రవాళ్ళూ, అమ్మాయిలు విందు చేయాలని నిశ్చయించుకున్నారు. ప్రతి ఒక్కటీ యించు మించుగా తయారైనాక, అనుకోని విషయం



ఒకటి జరిగింది.

ఒక కారు వచ్చింది. దాన్లోనుంచి ప్రిత్‌జెల్ దిగాడు. అతని వెనక యింకో తవుటి పురుగబ్బాయి దిగాడు. అందరూ అతనివేపు ఆశ్చర్యంగా చూశారు.

"అయ్యో దేవుడా! మన డూనో!" అని అరిచాడు డాక్టర్ ఫిల్మన్.

"డూనో వచ్చాడు!" అని అరిచాడు స్క్రూవటర్ బెయిల్,

డూనో చుట్టూ స్నేహితులంతా గుమిగూడారు. వాళ్ళతనిని కావలించుకుని ముద్దు పెట్టుకున్నారు.

"అమ్మయ్య, చివరికి నిన్ను మేము పట్టుకున్నాము!" అన్నారు వాళ్ళు.

"మీరు నన్ను పట్టుకున్నారా!" అన్నాడు డూనో ఆశ్చర్యంగా. "నా ఉద్దేశంలో నేనే మిమ్మల్ని పట్టుకున్నాను."

"అది నిజమే, నువ్వే మమ్మల్ని పట్టుకున్నావు. నువ్వు మమ్మల్ని వదిలిపెట్టి వెళ్ళిపోయావనుకున్నాము."

"నేను మిమ్మల్ని వదిలిపెట్టానా?" అన్నాడు మళ్ళీ డూనో ఆశ్చర్యపడి. "మీరే నన్ను వదిలేసినట్టుగా నా కనిపిస్తోంది."

"నువ్వే పారాఛూట్‌తో గంతేసి, మమ్మల్ని వదిలిపెట్టేశావు" అన్నాడు రోలీ-పోలీ.

"మీరెందుకుండిపోయారు? అందరూ గంతెయ్యాలని చెప్పానుకదా. బెలూన్ మరి పోలేదు గాబట్టి, నా తరవాత మీరూ గంతేసి వుండవలసింది. కాని మీకు భయం వేసినట్టుంది."

"అవును, మాకు భయం వేసింది" అని వాళ్ళూ ఒప్పుకున్నారు.

"గెంతడానికి వాళ్ళకు భయం వేసింది" అన్నాడు డున్నో."కాని మొదట ఎవరికి భయం వేసింది?"

"మొదటా? నువ్వే మొదటివాడివి" అన్నాడు ప్రోబ్లీ.

"నేనా?" అన్నాడు డున్నో ఆశ్చర్యంగా

"అవును నువ్వే"అని అందరూ అరిచారు. "మేము గెంతకూడదని చెప్పిందెవరు? నువ్వు కాదూ?"

"సరే, చాలా బాగుంది, నేనే అనుకోండి, కాని మీరు నామాట యెందుకు విన్నారు?" అన్నాడు డున్నో.

"అవునవును" అంటూ నవ్వాడు డూనో. "వినేందుకు మహామంచివాడు! డున్నో పెద్ద దద్దమ్మ అని మీకు తెలుసును గదా!"

"బాగా అంటున్నావే" అన్నాడు డున్నో కాస్త కోపంగా. "అయితే నేను దద్దమ్మనా?"

"పిరికి వాడివికూడా" అన్నాడు ట్రియస్లీ-స్వీటర్.

"బొంకులాడతావు కూడా" అన్నాడు రోలీ-పోలీ.

"నేను ఎప్పుడు బొంకులాడేను?"అని అడిగాడు డున్నో.

"నువ్వే బెలూన్ తయారు చేశావని ఎవరు చెప్పారు?" అనడిగాడు రోలీ-పోలీ.

"పొరబడుతున్నావా" అంటూ ఒగిర్చాడు డున్నో. "జీవితంలో ఎన్నడూ నేను బెలూన్ తయారు చెయ్యలేదు. బెలూన్ తయారు చేసింది, డూనో."

"నువ్వే దానికి పెద్దవని ఎవరు చెప్పారు?" అనడిగాడు ట్రియస్లీ-స్వీటర్.

"నేను దానికి పెద్దగా యెలా వుంటాను? నేను.... నేను ఎవణ్ని" అన్నాడు డున్నో.

ఇదంతా వింటోన్న బాలికలు నవ్వడం మొదలు పెట్టారు. డున్నో ఉత్త బడాయికోరని వాళ్ళకు తెలిసిపోయింది.

డున్నో అబద్ధాల రాయుడనీ, బెలూన్ చేసిన వాడు డూనోగాని డున్నో కాదనీ తమ స్నేహితురాండ్రకు చెప్పడానికి మిన్నీ, విన్నీ పరుగెత్తారు.



గడ్డిపూవు డున్నో దగ్గరకు వెళ్ళి, అసహ్యంతో యిలా అంది :

"మాతో ఎందుకు అబద్ధాలు చెప్పావు? మేము నీ మాటలు నమ్మి నువ్వేమో ధైర్యవంతుడివీ, తెలివైనవాడివీ, నిజాయితీ పరుడివీ అనుకున్నాము. కాని నువ్వు పిరికి పందవనీ, అబద్ధాల కోరువనీ యిప్పుడు తేలిపోయింది."

ఆ అమ్మాయి డున్నోదగ్గరనుండి డూనో దగ్గరకు వెళ్ళింది. అతని చుట్టూరా తవుటి పురుగులు గుమిగూడి వున్నారు. అతను ఏమిటి చెపుతాడో విందామని ప్రతిఒక్కరూ ఆతృతగా వున్నారు.

"మీరు గాలిలో పైకి వెళ్ళినప్పుడు, భూమి పందులాగా కనిపించిందట నిజమేనా?"అంటూ చిప్పీ అడిగింది అతనిని.

"కాదు. భూమి చాలా పెద్దది కావడంవల్ల పైకి పోతున్నకొద్దీ అది పెద్దదిగా కనిపిస్తుంది, విశాలంగా, యింకా విశాలంగా దానిని మీరు చూస్తారు గాబట్టి."

"మేఘాలు గట్టిగా వుంటాయనీ, గొడ్డలితో వాటిని నరుక్కుంటూ మీదికి పోవాలనీ అన్నది నిజమేనా?" అని అడిగింది గడ్డిపూవు.

"అదికూడా నిజంకాదు. పొగమంచుతో కూడివుండడంవల్ల మబ్బులు గాలి అంత మెత్తగా వుంటాయి. వాటిలోంచి వెళ్ళడానికి గొడ్డలితో నరకవలసిన పనేమీలేదు." అని చెప్పాడు డూనో.

బెలూన్‌లో ఆవిరి ఎక్కిస్తారా అనీ, అది తలక్రిందులుగా ప్రయాణం చేయగలుగుతుందా అనీ, మబ్బులకుమీదుగా వున్నప్పుడు వాతావరణం సున్నాకు ఒక వెయ్యి రెండు పదో వంతులు వుంటుందా అనీ వాళ్ళు అడిగారు. ఇవేవీ నిజంకాదని డూనో జవాబిచ్చాడు.

"ఈ అబద్ధాలన్నీ మీకెవరు చెప్పారు?" అని అతనడిగాడు.

"డున్నో చెప్పాడు"అంది బర్డీ.

అందరూ డున్నోవేపు తిరిగి పకపకా నవ్వారు డున్నో ముఖం కందగడ్డలా ఎర్రబడిపోయింది. దిగువ భూమి బద్దలయి తన్ను మింగేస్తే బాగుండుననిపించింది. అతను హటాత్తుగా పరుగెత్తుకపోయి చెట్లవెనుక దాక్కున్నాడు.

విందు అయిపోయాక డూనో, అతని స్నేహితులూ బయలుదేరారు. వాళ్ళు కాలి నడకను వెళ్దామనుకున్నారు. బెలూను పగిలి పోయింది. దానిని కుట్టడం కష్టం. అంతే కాకుండా ఎదురుగాలి.

గ్రీన్‌విల్లీలోని తపుటి పురుగమ్మాయి లందరూ వారికి వీడ్కోలు యివ్వడానికి వచ్చారు. వారిలో చాలామంది ఏడుస్తున్నారు.

“ఏడవకండి” అన్నాడు డూనో. “ఒకనాడు మళ్ళీ ఇంకో బెలూను తయారుచేసి మిమ్మల్ని చూడడానికి వస్తాము.”

“వసంతకాలంలో రండి, అప్పుడు చెట్లు కాపు కాస్తాయి” అని అరిచారు బాలికలు. “వసంతములో యిక్కడ చాలా చక్కగా వుంటుంది.”

ఊరు చివరికి వచ్చి ఆ అమ్మాయిలు ఆగిపోయారు. ఎత్తుగా పెరిగివున్న గడ్డికి, అడవి పూలకూ మధ్యగా పోతున్న దారివెంబడిని ఆ కుర్రవాళ్లు సాగిపోయారు.

“సెలవు! సెలవు!” అంటూ కేకలు వేసి వెనుదిరిగారమ్మాయిలు, చేతు లూపుతూ.

“సెలవు!” అని కేకేశారు తపుటిపురుగమ్మాయిలు.

(సశేషం)

## లెనిన్ కలగన్న కర్మాగారం

(1వ పుట తరువాయి)

గాలి రాకపోకలకు గట్టి ఏర్పాటు వుండడంవల్ల, హీట్ ట్రీట్‌మెంట్ యిన్‌స్టలేషన్‌వంటి విభాగాలకు కూడా పరిశుభ్రమైన గాలి పోతుంది. స్వయం చలితమైన పరికరాలు తుచ తప్పకుండా సరిగ్గా అతిసున్నితమైన భాగాలను కూడా తయారు చేస్తాయి. శీతోష్ణ స్థితిలో రెండు డిగ్రీల తేడాకూడా, వ్యతిరేక ఫలితాలకు దారి తీయ వచ్చును. కర్మాగారంలో ఎవరైనా సునాయాసంగా ఊపిరి పీల్చుకోవచ్చును, పని చేయవచ్చును.

ఇక్కడ ఆశ్చర్యపడవలసిందీ, సంతోషించవలసిందీ కూడా ఉన్నది. ఒక స్వయంచలన జీవన యంత్రం మన దృష్టి నాకర్షిస్తుంది. అది భాగాలను కడగడం మాత్రమే కాకుండా, వాటిని ఆర బెడుతుంది కూడా. ఇక్కడ మనకొక స్వయంచలితమైన బంకర్ కూడా కనిపిస్తుంది. దాని మాగజైన్లలో 36 గంటల భాగాల విలువ వుంటుంది, అవసరమైనప్పుడు అది సరఫరా చేస్తుంది.

వివిధ భాగాలను తయారు చేయడం మాత్రమే కాకుండా, రెండురకాల బేరింగుల అసెంబ్లింగ్ కూడా స్వయం చలితంగా జరుగుతుంది. వీటిలోని ఒక బేరింగులో పది భాగాలున్నాయి, యింకో దానిలో 21 భాగాలున్నాయి.

అయితే కర్మాగారపు కార్మికులకు మిగిలిందేమిటి? ఒకొక్క షిఫ్టుకూ 75 మంది వున్నారు. పర్యవేక్షణకు, అమర్చడానికీ, లోపాలు రాకుండా చూడడానికీ వారిపని పరిమితమైవుంది. ఉన్నత నైపుణ్యం, గొప్ప సాంకేతిక పరిజ్ఞానం వారికి అవసరం. ఇటువంటి కార్మికునికి ఎలెక్ట్రానిక్సులో బాగా పరిచయం వుండాలన్నదీ, రేఖాగణితం తెలిసి వుండాలన్నదీ, డ్రాయింగులు బాగా తెలిసివుండాలన్నది స్పష్టమే. ఇక్కడ వున్నవారు నానాటికీ అధికతరంగా సెకండరీ విద్యనూ, ప్రత్యేక విద్యనూ పొందుతున్నారన్నా, చాలామంది సాయంకాల పాఠశాలలలో గాని, సెకండరీ, ఉన్నత సాంకేతిక సంస్థలలోని తపాలా విద్యను పొందుతున్నారన్నా ఆశ్చర్యమేమీ లేదు.

మా దేశంలోని అన్నిటికంటె విలువైన నిధి, శ్రామికులు. ప్రతిచోటా—పారిశ్రామిక నిర్మాణ నగరాలలోనూ, పెద్ద ఫ్యాక్టరీలలోనూ, కళన పరిశ్రమలలోనూ, వ్యవసాయంలోనూ కార్మికుల కొరత వుంది. యావత్తు కర్మాగారాలనూ, పరిశ్రమలనూ స్వయంచలనం చేస్తే, జాతీయ ఆర్థిక వ్యవస్థకు యెంతో అవసరమైన యింకా లక్షలాది మంది కార్మికులు లభ్యమవుతారు.

ఇవి ప్రముఖమైన విషయాలు! రాబోయే సంవత్సరాలలో మాకు అధికతరంగా యిటువంటి స్వయంచలన కర్మాగారాలు వస్తాయి, స్వయంచలన పరిశ్రమలుకూడా లభిస్తాయి; యంత్రాలపైని మానవుని ఆధిక్యతను స్థాపించడానికి లెనిన్ కన్నకలకు యివి సాక్షీభూతమైనవి.

## విషయ సూచిక



ముఖ చిత్రం : బాల సంఘ సభ్యులు

మూడవ అట్ట : “మా బిడ్డలను యుద్ధంకోసమని మేము పెంచము!” —అంతర్జాతీయ బాలరక్షణ దినోత్సవానికి వెలువరించబడిన, ఎన్. వతోలినా చిత్రించిన పోస్టర్.

వెనుక అట్ట : అమూర్ నది వొడ్డునవున్న ఒక బాలసంఘ శిబిరం